# కూచిమంచి తిమ్మకవి

# సింహాచల మాహాత్మ్యము

## - ఒక పరిశీలన



డాక్టర్ ఎం. బాగయ్య

కూచిమంచి తిమ్మకవి సింహాచల మాహాత్మ్యము-ఒక పరిశీలన
KUCHI MANCHI THIMMAKAVI SIMHACHALA MAHATMYAMU-OKA PARISEELANA

ప్రథమ ముద్రణ : అక్టోబర్ - 1991.

ప్రతులు : 1000



వెల : రూ. 40-00

ప్రతులకు :

ఎం. శ్రీకాంత్ కుమార్
రమా నిలయము,
ఇం.నెం. 12-11-833/4/1,
అంబర్‌నగర్-అడ్డిక్‌మెట్టు
హైదరాబాదు-500044.



ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్
మున్సిపల్ కాంప్లెక్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు-500 020.

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయము పొందినది

# నా లోని మాట

నేటికి రెండు దశాబ్దాల నాడు ఆంధ్రప్రాచ్య కళాశాలలోచ దువుచున్న రోజులలో కూచిమంచి తిమ్మకవి రచనల గూర్చి విన్నది కన్నరీతిగా చదివిన నాటిది. నేటి నా పరిశోధనకు ఆధారమైనది. ప్రాచీన పద్యగ్రంథములపై పరిశోధించుట నాకిష్టముగా తోచినది. నాడు నాలో అంకురించిన వృక్షము నేడు పుష్పించి ఫలించినది. అది నా జీవిత సాఫల్యమునకు సోపానముగా, భావించుచున్నాను.

దైవ గ్రంథ ప్రాశస్త్యము పరిశోధించవలెనన్న నాలోని కాంక్షను ఫలదీకరింపజేసినాడా సింహాద్రినాథుడు. అతడే నన్ను ఈ గ్రంథమును తన కంకితమిమ్మని 12-01-1991. శనివారము తెల్లవారు జామున స్వప్నములో సాక్షాత్కరించి ఆదేశించినాడు. యథార్థమును వక్కాణించుట నావిధి.

ఈ ఐదు ప్రకరణములుగా వింగడించిన గ్రంథ విధానము ప్రాచీన పక్కిలో సాగినది. పౌరాణికమైన కథను, ప్రబంధ వర్ణనలు గావించి, క్షేత్ర మహిమలను తెలుపుచున్నది అల్పజ్ఞుడనైన నేను చిన్ననావనెక్కి సముద్రమును ఈదినట్లు, ఆ సింహాద్రిస్వామి చరిత్రను పరిశోధింప బూనుకొంటిని.

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య టి. నవనీతరావు గారు నా ఉన్నత విద్యకు పరోక్ష గురువులు వారికి నా హృదయ పూర్వక నమో వాక్కులు. ఈ గ్రంథమునకు పీఠికలందించిన పెద్దలందరికి అభినందనములు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయము అందజేసిన స్వామి సన్నిధిలు తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా హృదయాభినందనలు.

ఈ వ్యాసము పండితులకు ఏ మాత్రము తృప్తి కల్గించినను నా కృషిని ధన్యముగా భావింతును.

తేది. 10-10-1991

ఎం. బాగయ్య

న్యాయమూర్తి, జి. రామానుజులు నాయుడు (రిటైర్డ్)
హైకోర్టు-ఆంధ్రప్రదేశ్

ఫోన్ : రెసి : 213196
ప్రభుత్వ బిల్డింగ్ నెం. 'సి'
కుందన్‌బాగ్-బేగంపేట్,
హైదరాబాదు-500 016.
తేది 24-8-1991

# ఆశీరభినందన

ప్రపంచంలో పరిశోధన రంగమునకు పరిధులు లేవు. ఆర్హతలకు అవధులు లేవు. మానవుడు భూమిపై అవతరించిన నాటి నుండి నేటి వరకు ఏదో ఒక రంగములో అభివృద్ధి చెందుతూనే ఉన్నాడు. అందులోని ఒక భాగమే గ్రంథ పరిశోధనము. ప్రాచీన గ్రంథములపై పరిశోధన చేయుట సముద్రమును ఈదుట వంటిదే. ముఖ్యముగా క్షేత్రమాహాత్మ్యములపై పరిశోధించి వాటి ప్రాకార, గోపురాదుల నిర్మాణములు, వాటి కాలము, శాసనములు గ్రహించుటకు చరిత్రయే ఆధారము. శ్రీకృష్ణదేవరాయల వారు శ్రీ సింహాద్రికి వచ్చి స్వామికి, అమ్మ వారికి అర్పించిన సొమ్ములు, క్రీ.శ. 11వ శతాబ్దములో కులోత్తుంగుడు, క్రీ.శ. 13వ శతాబ్దములో గరిగ నరసింహదేవుడు స్వామికి సమర్పించిన వాటిని గూర్చి శాసనములను సేకరించిరి.

ఇంతేగాక మహారాష్ట్ర రాజులలో ఒకరైన ఏకోజీ మహారాజు చేత రచింపబడిన విఘ్నేశ్వర కళ్యాణము, రామాయణము-మొదలయిన అముద్రిత గ్రంథములను పరిష్కరించినాడు. ఇవి డా॥ బాగయ్య చేతనే ఆకాశవాణిలో ప్రసారితములైనవి.

చిరంజీవి డా॥ బాగయ్య ఎంతో చరిత్ర గల్గిన తూర్పు తీరాన గల సింహాద్రిని తనివితీర చూచినట్లుగా గోచరిస్తుందీ గ్రంథాన్ని చదివినపుడు. డా॥ బాగయ్య వినయ శోభితుడు, నమ్రహృదయుడు, చక్కటి కవితాధార గలవాడు. ఇతడు, ఇంకా ఎన్నో రచనలు చేసి మహోన్నత పదవులు అలంకరించాలని ఆశీర్వదిస్తున్నాను.

శ్రీ ఆర్. ప్రభాకర రావు ఐ.పి.యస్.
డైరెక్టర్ జనరల్ &
ఇన్‌స్పెక్టర్-జనరల్ ఆఫ్ పోలీస్

హైదరాబాద్,
తేది. 22-7-1991

# ఆశీరభినందన

అధునిక కాలములో ప్రాచీన కావ్యాలపై పరిశోధన చేస్తున్నవారు అరుదు. అందులో చిరంజీవి డా॥ యం. భాగయ్య "శ్రీ సింహాచల మాహాత్మ్యం"పై చక్కని పరిశీలన చేసినారు. ఆలయముపై 11వ శతాబ్దము నుండి నేటి వరకు జరుగుచున్న రాజవంశీకుల పూజలు-ప్రశంసలు చక్కగా చిక్కగా కూర్చినారు. శ్రీకృష్ణదేవరాయలు స్వామివారికి, అమ్మవారికి అర్పించిన సొమ్ములు శాసనములో చూపినారు. భారతావనికి తూర్పు తీరాన గల సింహాద్రిస్వామిని గూర్చి పరిశోధించుట తేలికైన పనికాదు. అందులో వీరి పరిశోధన సరళశైలి గల్గి, మృదుమధుర భక్తిభావములతో విలసిల్లినది.

ఇది క్షేత్రమాహాత్మ్యమయ్యును ప్రబంధ పక్కిగా నడిచిన తీరు చక్కగా వర్ణించినాడు. వీరు పౌరాణిక గ్రంథములపై చేసిన చేస్తున్న పరిశోధన బహుళ ప్రయోజనము గల్గియున్నది. ఇహపర ముక్తిసోపానములు గల్గియున్నది. శ్రీనాథకవిసార్వభౌమాదుల తీరుగా నితడు బహుగ్రంథములు వ్రాసి కవి సార్వభౌమ బిరుదు పొందినాడు. తిమ్మకవి.ఇతని కృతులపై పిహెచ్.డి. పట్టా తీసుకొన్న చి॥ డా॥ యం. భాగయ్య ప్రశంసనీయుడు.

మహారాష్ట్ర రాజులైన భోంస్లే ఏకోజీ విఘ్నేశ్వర కళ్యాణము ద్విపద రామాయణములు అముద్రితములు, వీటిని పరిష్కరించినాడీ పండితుడు. వీటిని వెలికి తీయడమేగాక, ఆకాశవాణిలో తన బాణిని ధ్వనింపజేసినాడు.

వినమ్రహృదయుడు, మృదుభాషనుడు, మంచి పరిశోధకుడు అయిన డా॥ భాగయ్యను ఇంకా ఎన్నో పరిశీలించి గొప్ప పదవుల నలంకరించాలని భగవంతుని ప్రార్థిస్తూ, ఆశీర్వదిస్తున్నాను.

న్యాయమూర్తి, ఇయ్యాపు పాండురంగారావు
హైకోర్టు-ఆంధ్రప్రదేశ్ నెం. 7, కుందన్‌బాగ్
మినిస్టర్స్ కాలనీ, హైదరాబాద్-16.
తేది. 23-8-1991

శ్రీ సింహాచల క్షేత్రం భారతదేశంలో ముఖ్యంగా ఉత్తరాంధ్రదేశంలో గలదేవాలయాలలో అతి ప్రాచీనమైనది. ప్రసిద్ధమైనది.

పూర్వాంధ్ర కవులలో ప్రసిద్ధులైన కూచిమంచి తిమ్మకవి విరచితమైన "సింహాచల మాహాత్మ్యము" అనే క్షేత్రమాహాత్మ్య కావ్యంపై మిత్రులు డా॥ బాగయ్యగారి పరిశోధనాత్మక వ్యాసం యీ గ్రంథం.

భారతీయ సంస్కృతికి నిలయాలు మన దేవాలయాలు, అవి హైందవ జీవన విధానాన్ని ఎంతగానో ప్రభావితం చేశాయి.

ఈ పరిశీలనలో కూచిమంచి తిమ్మకవి కవితా ప్రశస్తితో పాటు. యీ మహాక్షేత్రం యొక్క చారిత్రక విషయాలు, క్షేత్రమహిమ, స్థల విశిష్టత మున్నగు విషయాలు, యీ మహాక్షేత్రంలో గల శాసనాలను గురించి ఉల్లేఖించడం జరిగింది. ఒక్క మాటలో చెప్పాలంటే, కూచిమంచి కవి పరేణ్యుని గురించి. వారి రచనలను గురించి, సింహాచలక్షేత్రం గురించి పూర్తి విషయాలను వెలికితీసి విపులీకరించడం జరిగింది.

ఇదే విధంగా ఆంధ్రదేశంలో గల అన్ని ప్రసిద్ధ దేవాలయాలను గురించి ప్రాచీన గ్రంథాలలో గల ప్రశస్తి, శాసనాలు మున్నగు చారిత్రక ఆధారాలు గ్రంథ రూపాల్లో ప్రకటించాలని, అందుకు డా॥ బాగయ్యవంటి పరిశోధకులు, విద్వత్కవులు ముందుకు రావాలని, వారిని ప్రభుత్వం ప్రోత్సహించాలని నా ఆకాంక్ష.

ఏంతో కృషిచేసి, యీ పరిశోధనా వ్యాసం వ్రాసిన మిత్రులు డా॥ బాగయ్యగారికి నా అభినందనలు.

న్యాయమూర్తి, ఇమ్మానేని పాండురంగారావు

హైకోర్టు-ఆంధ్రప్రదేశ్

ఫోన్ : రెసి, 212723
గవర్నమెంట్ క్వార్టర్, ఎం. 2,
స్పెషల్ ఎ. మినిస్టర్స్ క్వార్టర్స్,
కుందన్‌బాగ్, బేగంపేట,
హైదరాబాద్-500 016.
తేది : 28-8-1991

# ఆశీస్సు

చిరంజీవి డా॥ యం. బాగయ్యగారు "సింహాచల మాహాత్మ్యము - ఒక పరిశీలన" అనే గ్రంథం ప్రచురించిన సందర్భములో నా శుభాకాంక్షలు తెలుపుతున్నాను. అంతేగాక, వీరు కూచిమంచి తిమ్మకవి కృతులపై పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి పి.హెచ్.డి. పట్టా పుచ్చుకున్నారు క్రీ.శ. 18వ శతాబ్దానికి చెందిన కవి సార్వభౌముడైన కూచిమంచి తిమ్మకవి బహుగ్రంథ కృతికర్త. పరమేశ్వర భక్తుడు. కుక్కుటేశ్వరస్వామి ఆలయములో లింగైక్యము చెందినాడు. ఈతని కృతుల వింగడింపులో డా. బాగయ్య గారు చక్కని పరిశ్రమ చేసినారు. క్షేత్ర, ప్రబంధ, అచ్చ తెలుగు, లక్షణ గ్రంథ, శతక దండకాలను వివరించుటలో వీరి కృషి సఫలమైనది. వీరి పరిశోధనా వ్యాస రచనా సరళి గ్రాంథిక భాషలో ఉండి పౌరాణిక పద్ధతిలో నడచినది. సరళశైలి మృదుమధుర భాషా విధానము డా॥ బాగయ్య గారికి మంచి పేరును సంపాదించినది.

డా॥ బాగయ్య గారు శ్రమైకజీవి, కళోపాసకుడు వినయశోభితుడు, నమ్రహృదయుడు, సాహిత్యాభిలాషి, లలిత కళలలో ప్రావీణ్యము సంపాదించారు. నిత్యసాధన భగవదారాధన లాంటిది. ఇటువంటి పురాణ, దైవ గ్రంథములు పరిశోధించి దైవానికి అంకితమిచ్చుటలో వ్యక్తికి ముక్తికి సోపానములు కూడిన. చిక్కని పరిపుష్టము గల్గిన, చక్కని పరిశోధనా గ్రంథము నిర్మించిన డా. బాగయ్య గారికి శుభాభినందనలు.

# విషయసూచిక

# ప్రథమ ప్రకరణము

## శ్రీ సింహాచల క్షేత్ర ప్రశస్తి

(సింహాచలాన్ని గూర్చిన వివరాలు క్షేత్రానికి సంబంధించిన కథలు-
కావ్యాల్లో దీన్ని గూర్చిన సూచనలు)

శ్రీ సింహాచలము ఆంధ్ర ప్రదేశమందలి విశాఖపట్టణమునకు సుమారు 15 కి. మీ. దూరముననున్న పుణ్యక్షేత్రము. అందు వెలసిన స్వామి సింహాద్రి నాథుడు.

సింహాద్రి నారసింహ స్వామి మారిన కాలానికి దూరంగా ఉండాలని, అడవిలో ఏకాకిగా తనపై చెదలు పుట్టలుకాగా, పరులకు కానరాక యుండెను. మనుషులు మారినారు. మనస్తత్వాలు మారినవి. కాలము మారినది. యుగాలు మారినవి. ఆస్తిక్యం అడగంటినది. భక్తి నశించినది. స్వాముల ఆరాధనలు మూలబడ్డాయి. కావున మనుషులకు దూరంగా నున్నాడా స్వామి అన్నట్లుగ పచ్చని కొండపై లక్ష్మీదేవితో చేరి యున్నాడు.

ఇట్లున్న సమయములో గగన మార్గాన ఒకనాడు ఊర్వశితో కలిసి పురూరవ చక్రవర్తి పుష్పక విమానమెక్కి విహరిస్తూ సింహాచలానికి చేరగ, వారి విమానానికి "గతిస్తంభనం" ఏర్పడింది.[1] అట్టి సమయమున చక్రవర్తి కేది తోచకుండెను. ఊర్వశి అప్సరస కనుక పూర్వపు వాసనలు (దివ్య

1. శ్రీ లక్ష్మీ నారాయణ మహాక్రతు విశేష సంచిక, మే, 1984.

వాసనలు) కలది కావున శిష్టరక్షకుడగు వరాహ లక్ష్మీ నరసింహుడు ఇచట యుండి ఉంటాడని భావించి చెప్పెను. సేవించి తరించిన చాలునన గా అతడట్లే గావించెను.

వారిట్లు తరించడానికి పురూరవ చక్రవర్తి సింహాద్రిలో మూడు దినములు గడిపెను. మూడవ రోజు రాత్రి కలలో వరాహ నరసింహస్వామి సాక్షాత్కరించి, ఎదురుగా గల పుట్టలో నున్నాననియు, పంచామృత క్షీరాబ్ధి అభిషేకములతో పుట్టను తడిపిన తన దర్శనము లభించుననియు, అర్చనాధికము చేసిన పిమ్మట చందనముతో ఆచ్ఛాదించమనియు చెప్పాడు.[2]

స్వప్నములో స్వామి చెప్పిన విధంగానే మేల్కొన్న పురూరవుడు అట్లే గావించినాడు. కుందాభసుందర తనుడు, త్రిభంగిలలితుడు, కటీరన్యస్తహస్తుడు, వరాహముఖుడు, సింహవాలుడు, నరాకారుడు అగు శ్రీ స్వామి చక్రవర్తికి సాక్షాత్కరించాడు. ఇది మహాభక్తుల యెడ భగవంతుడిచ్చే వరముగా భావించవచ్చును. ఇది పురాణ దారిని నడిచిన కథగా ఉన్నది.

ఇంతటితో పురూరవునకు తృప్తి గలుగలేదు కారణము-స్వామి చరణారవింద దర్శన భాగ్యము లభించలేదని బాధతో ప్రాయోపవేశము చేశాడు. అప్పుడు ఆకాశవాణి ఇట్లు పల్కినది :

"ఓ రాజా! చూడగానే ముక్తిలభించే చరణాలు అందరకు దర్శనీయములు కావు. కావున ఇక్కడికి తృప్తిపడుము. విచారించకుము" అని చెప్పెను. స్వామి మొదట చెప్పిన విధంగానే పురూరవుడు పునుగు జవ్వాది పరిమళ ద్రవ్యాలను కల్పి పచ్చి చందనము స్వామిపై పూత పూయించి, నిత్యోత్సవ- విశేషోత్సవములకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. అప్పుడు పుట్టలోని స్వామి చక్రవర్తికి సాక్షాత్కరించాడు. ఆ దినము వైశాఖ శుక్ల తదియ కావున నేటికీ ఈ రోజున

2. శ్రీ లక్ష్మీనారాయణ మహాక్రతు విశేష సంచిక - మే 1984.

మహోత్సవములు జరుగుచున్నవి. ఈ ఒక్కరోజు మాత్రము నిజరూప దర్శనము లభించును. మిగిలిన రోజులలో చందనపు పూతతోనే స్వామి సేవనీయుడనీ మరి ఇతర రోజులలో చందనపు పూత తొలగిస్తే వాని వంశము నశించుననియు గలదు.

ఈ కథ క్షేత్రమాహాత్మ్యములో కలదు. పై తీరుగానే నేటికి వైశాఖ శుక్ల తదియనాడు చందన యాత్రాది మహోత్సవ కార్యక్రమములు జరుగుచున్నవి.

1. కథ:- సింహాచలము చారిత్రకంగా మిక్కిలి ప్రసిద్ధిగలది. క్రీ.శ. 11 ప్రారంభము నుండి ఇక్కడ శాసనములు కన్పిస్తున్నాయి.[4] చోళ చక్రవర్తి యగు కులోత్తుంగుని అధికార పరిపాలనము క్రీ.శ. 1076 నుండి క్రీ.శ. 1087 వరకు గలదు. ఇతని శాసనము క్రీ. శ. 1087 శతాబ్దిది (బిందు) అనే దానిలో గలదు.

2. కథ:- కళింగ దేశంలోని గరిగ వంశానికి చెందిన ప్రథమ నరసింహదేవుడు (క్రీ. శ. 1287-63), ఆయన తల్లి మహారాణి గంగాదేవి - నృసింహస్వామికి సమర్పణలు చేసినట్లును శాసనము కలదు [5]

3. కథ:- క్రీ. శ. 1268 సంవత్సరములో కళింగ గాంగ వంశుడైన వీర శ్రీ నరసింహ దేవ చక్రవర్తి ఆజ్ఞమేరకు - శ్రీ విమాన ముఖమండప - నాట్యమండపాలు - తిరుచుట్టుమాల నిర్మింపబడినట్లు గుడిలో శాసనము కలదు. గంగాదేవి అఖండ దీపకళికను అంజలితో పట్టుకొని ఉన్నట్లున్న ప్రతిమ నేటికినీ దేవాలయములో నిలిచి ఉన్నది.[6]

---

3. సి. మా. 1 ఆ.

4. డా॥ సుందరమ్, ది సింహాచల టెంపుల్. పేజీ - 16.

5. ది సింహాచలము టెంపుల్. పేజి 19. విశేష సంచిక 1984 పేజి 52.

6. విశేష సంచిక - 1984 పుట 52

చాళుక్య చోళుల తరువాత శ్రీ సింహాద్రి స్వామిని సేవించి సమర్పించి - ఆలయ రక్షణకు పాటుపడిన వారిలో కళింగ గాంగ చక్రవర్తులు గణనీయులు. వీరితోపాటు, భార్యలు, మహారాణులు, మంత్రులు, మండలాధిపతులు, సామంతులు ఇంకా ఎందరో శ్రీ స్వామిని దర్శించి సేవించినారు. ఆనాడు చతుర్వేద విద్యలకు సంగీత సంకీర్తనాది సంప్రదాయ సంస్కృతులకు నిలయము సింహాచలమేనని శాసనాల వలన తెలియుచున్నది.[7]

ఒడ్డాదికి చెందిన అమాత్యులు కళింగలో మంచి పేరుగలవారు. వీరు ఇపుడు సింహాచలానికి సుమారు 30 మైళ్ళ దూరంలోగల గ్రామముివారే[8] స్వామిజాతరనాడు నందాపురపు రాజులు, ఎలమంచి చాళుక్యులు, సురభి వంశీయులు, వీర కూటం పల్లవులు, కొప్పుల నాయకులు, కోరుకొండ నాయకులు, ఒరిస్సా దేశపు సూర్యవంశ గజపతులు - మరి ఎందరో శ్రీ వరాహ స్వామిని సేవించినారు. కర్ణాటాంధ్ర క్షమా వల్లభుడు శ్రీ కృష్ణ దేవరాయలు తన దేవేరులతో కలసివచ్చి సింహాద్రి స్వామిని దర్శించి, ఎన్నో కానుకలు అర్పించినట్లు శాసనాలు గలవు[9]. ఇచ్చట ఒక జయ స్తంభమును స్థాపించినట్లును నేటికి ఆనవాలు గలవు.[10]

కవి సార్వభౌముడు శ్రీనాథుడు, వీరభద్రారెడ్డి పరిపాలనలో అతని ప్రధాన మంత్రి కాటయ వేమునితో స్వామిని సేవించి పుష్పమాలా కైంకర్యమును సమర్పించినట్లును శాసనము వలన మనకు తెలియుచున్నవి.[12]

7. విశేష సంచిక - 1984 పుట 52
8. ది సింహాచల టెంపుల్ పేజి - 20.
9. అనుబంధము
10. విశేష సంచిక పుట - 55.
11. చాటుపద్య మణిమంజరి. వేటూరి విశేష సంచిక, 58 పుట.
12. విశేష సంచిక - 58 పుట.

మధ్వ సంప్రదాయమునకు చెందిన నరహరి తీర్థులు మరియు వారి శిష్యులు కలిసి సింహాద్రినాథుని సేవించినట్లు శాసన ప్రామాణికము కనబడుతున్నది.[13] క్రీ.శ. 17 వ శతాబ్ది ఉత్తరార్ధము నుండి సింహాచల దేవస్థానము - విజయనగర పూసపాటి జమీందారుల అధీనములోనికి వచ్చినది. వారికి స్వామియే ఇలవేల్పు అయినాడు. పూసపాటి రాజులు ఇటీవలి కాలములో సింహాచల దేవాలయాభివృద్ధికి ఎనలేని సేవ చేసిరి.

క్రీ.శ. 1790 లో రెండవ విజయ రామరాజు గారు దేవాలయ నిర్వహణకుగాను తమ ఏలుబడిలోని 14 గ్రామాలు ఇచ్చినారు. భోగ మందిరము, శయన మందిరము, జ్యేష్ఠ - ఆషాఢ మాసములలో జరుపు ఉత్సవములకై మంటపాదులు వీరి కాలములోనే ఏర్పాటు చేయబడినవి [14]

శ్రీ వైష్ణవ స్థాపకులగు రామానుజులు సింహాచలము వచ్చి స్వామిని సేవించినట్లు ఆచార్య సూక్తి ముక్తావళి చెప్పుతున్నది.[15] ఆ కాలములోనే మహా భక్తుడుగా, సంకీర్తనాచార్యుడుగా పేరు గాంచిన కృష్ణమాచార్యులు స్వామిని సేవించినట్లు తెలుస్తున్నది. వీరు శ్రీ స్వామివారిని "సింహగిరి నరహరి నమో నమో దయానిధి" అనే మకుటముతో కీర్తించినట్లు ఆచార్య కులశేఖరరావుగారు వెలుగులోనికి తెచ్చిన సింహగిరి వచనములో గలదు. ఈ స్వామి ప్రత్యక్షమై కృష్ణమాచార్యులతో మాట్లాడెనని, వీరు గానము చేయుచుండగా, స్వామివారు నాట్యమాడిరని ఇతిహాసములు గలవు. ఇతడే చతుర్లక్ష గ్రంథ పరిమితిగల సంకీర్తనలు స్వామిపై పాడినట్లుగు వీరి వచనములవలన తెలియుచున్నది.[16]

---

13. విశేష సంచిక 1984, 53 పుట.
14. కృష్ణదేవరాయులు శాసనము అనుబంధములో గలదు.
15. విశేష సంచికలో 53 పుట.
16. సింహగిరి వచనములు.

ఇవి రాగిరేకులపై వ్రాయించి స్వామికి సమర్పించినట్లు తెలియుచున్నది. ఈయన 11వ అవతారమనికూడా సింహగిరి వచనాలలో కృష్ణమాచార్యులు చెప్పారు

శ్రీ కృష్ణ దేవరాయలు సింహాద్రి వద్ద జయ స్తంభము కట్టించినట్లు రాయ వాచకమూ, కృష్ణరాయ విజయమూ చెప్పుచున్నాయి.[17] వీరి సైన్యాధిపతి ఈ స్తంభము ఎత్తించినట్లు కనబడుచున్నది. ఇవి రాయల ఆముక్తమాల్యద లోను కలదు.

చ॥ "అభిరతి గృష్ణ రాయ విజయాంకము లీవు లిఖించి తాళస
న్నిభముగ బొట్టు నూరికడ నిల్పినకంబము సింహభూధర,
ప్రభు తిరునాళ్ళకున్ దిగుసుర ప్రకరంబు కళింగ మేదినీ,
విభునపకీర్తి కజ్జలము నేయుబు బెట్టి పఠించు నిచ్చలున్"

(ఆ. మా. 1-40)

ఈ ప్రస్తావన సింహాచల శాసనాలలోను గలదని తెలియుచున్నది. క్రీ. శ. 1476లో పురుషోత్తమదేవుడు అను గజపతి రాజు 500 టంకాలు సంవత్సరాదాయమును దానము చేసెను. ఈ దేవాలయము 11వ శతాబ్దము మొదటి పాదము వరకు సాంఘిక రాజకీయ దాడులకు గురియయ్యెను.[18]

17. వరాహ పురాణము, 1 వాల్యూమ్, 11 పుట

18. ది సింహాచలం టెంపుల్

## కళాపూర్ణోదయములో పింగళి సూరన్న చేసిన సింహాచల వర్ణన :

తుంబురుడు మను ధర్మాదుల చెప్పుచు భూలోకమందలి శ్రీరంగాది దివ్య క్షేత్రములను శ్రీ పురుషోత్తమ దివ్యగుణనామ సంకీర్తన గానము చేయవలెనని తలచి ఆడుచు పాడుచు మణికంధరుడు తీర్థయాత్రలు గావించెను. అట్టి తీర్థ యాత్రలలో మధుర, హరిద్వారము, సాలగ్రామము, బదరికాశ్రమమును, నైమిశారణ్యమును, కురుక్షేత్రము, ప్రయాగ, కాశి, అయోధ్య, గంగాసాగర సంగమము, నీలాచలమును దర్శించెను.

సీ॥ ఇత్తెఱంగున బురుషోత్తమ శ్రీజగ
 న్నాథుని సంసేవనమున దనరి
శ్రీకూర్మ విభుని యంఘ్రీసరోరుహంబులు
 కనుదమ్ములకు విందుగా నొనర్చి
సింహాచలాధీశ సేవావిశేష లీ
 లలను జన్మము నలంకరించి
శ్రీమదహోబల స్వామి పాదన ధోడు
 జాల సంఘము ఫాల శశికి నొసగి

తే॥ వేంకటేశ్వర చరణార విందగంధ
నందదిందిందిర శ్రేణి నైల్యమునను
నిజ శిఖాకాంతికిని బుష్టి నిర్వహింప
జనియె నాదరమేదుర స్వాంతుడగుచు.*

ఈ సింహాచలము కళింగ దేశములో నుండెను. మూడవ అనంగ భీముడు పోషించెను. ఇతడేకాక మాత్స్యాలు-ఒడ్డాదులు-చాళుక్యులు-(ఎలమంచి)

* కళా. 2 - 126 ప.

పల్లవులు-వీరకూటము, శిలవంశ ముఖ్యులు అగు నందపుర వాసులు కొప్పుల ముఖ్యులు, కోరుకొండ ముఖ్యులు, కళింగరాజుల మధ్య కాలమున కోస్తాంధ్రులు చేరియుండిరి. ఈ మధ్య ఇంద్రవర్మకు (గాంగేయుల) ఇంద్రభట్టారక (విష్ణు కుండినులకు) ఆరవ శతాబ్దమున యుద్ధము జరిగెను. గాంగులకు - చాళుక్యులకు (చోళులు) గాంగ - కాకతీయులకు, గాంగ - రెడ్లకు యుద్ధములు జరిగెను. గజపతి రాజులు - విజయనగర వారి పాలనలో సింహాచల శాసనములు వెలసినవి.[19]

మహాభారతము ప్రకారము కళింగదేశమే నేటి "కటక" జిల్లా. ఇది ఒరిస్సా రాష్ట్రములో గలదు. దీనికి క్రీ. పూ. 3 వ శతాబ్దములో సరిహద్దులు చేసియుండిరి. (మహాభార-స. ప 3-అ. 114 ప)

ఏడవ శతాబ్దములో చైనా యాత్రికుడగు హ్యూయాన్‌త్సాంగ్ మన దేశమును సందర్శించినప్పటికి కుంగులు (కాంగర) అనువాటి నుండి ఈ పదము వచ్చినట్లు గలదు.[20] ఇది రాను రాను కళింగగా మారినది. దీని క్రింది భాగమున కొంగద - కళింగ నేటికినీ గలదు ఇదే తమిళ రాజుల చేత 11 వ శతాబ్దమున సరిహద్దు చేయబడినది. దీనికి ఉత్తరాన మహేంద్రగిరి సరిహద్దుగా నుండెను [21]

రెండవ పులకేశి- హ్యూయాన్‌త్సాంగ్ చైనా యాత్రికుడు మన దేశమునకు వచ్చిన కాలములో అనగా క్రీ.శ. 635 నుండి 652 వరకు సింహాచలము కొంత భాగము నిర్మింపబడి యుండెను.[22]

మెకంజీ కైఫీయతులు - 19 వ శతాబ్దమున గంజాము జిల్లా కళింగ రాజ్యములో గలదు. ఇది ఒరిస్సా రాష్ట్రములోను దక్షిణాంధ్రములోను గలదు.

---

19. ది సింహాచలం టెంపుల్.
20. Wattan - Yuam Chauang - Vol-II page-198.
21. ద ఇండియన్ టెంపుల్. పేజీ - 11.
22. ది సింహాచలం టెంపుల్.

శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1513 లో ఉదయగిరి నేలుచుండెను. క్రీ.శ. 1516 లో ఇతడు సింహాద్రిని చేరెను. త్రోవలో ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరములను దర్శించెను.[23] ఇతని తల్లి దండ్రులు అనేక దాన ధర్మాలు చేసిరి. ఇతడు ప్రతాపరుద్రుని కొక విజ్ఞప్తి చేసెను. సైన్యాన్ని గజపతులతో యుద్ధము చేయుటకు నిలువనిమ్మని కోరెను. తిరిగి తాను వచ్చి సైన్యమును సమకూర్చుకొని యుద్ధమునకు దిగెను. రాయసం కొండ నరసయ్య గజపతులకు గుండెకాయ వంటి సైన్యాధిపతి.

చివరకు ప్రతాపరుద్రునకు - రాయలకు సంధి కుదిరెను. రాయలు ప్రతాపరుద్రుని బిడ్డను పెండ్లి చేసుకొనెను. అప్పుడు కృష్ణానది నుండి పోవుటకు ప్రతాపరుద్రుడు అనుమతించెను. క్రీ. శ. 1519 లో రాయలు సింహాచలము - దర్శింపవచ్చెను. అప్పుడు గజపతులకు రాయలకు భీకర సంగ్రామము సాగినది.[24]

నగర రాజులకు కళింగాధిపతులకు యుద్ధము సాగుచుండగా ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1532లో చనిపోయెను. వీరి యుద్ధము ఒక దశాబ్దము వరకు అట్లే సాగినది.

## శ్రీ స్వామివారికి శ్రీకృష్ణదేవరాయలు అర్పించిన సొమ్ములు:

1. కంఠాభరణము : ఇది మరకత, మాణిక్యాదిపచ్చలతో పొదిగినది. (కోయకుండ పొదిగినది). మధ్యలో ఒక కెంపు పెట్టి చేయబడినది.

---

23. ది సింహాచలం టెంపుల్ పేజీ 25.

24. ది సింహాచలం టెంపుల్ పేజీ 25.

2. తిరుమణి : వజ్రాలలో చేసినది. మధ్యలో దీనికి కూడ కెంపు పొదగ బడినది. ఇది 'U' అకారములో తయారుచేయబడినది. వైష్ణవగుర్తు గలది.

3. నడుము పట్టి : ఇది బంగారముతో తయారు చేయబడినది. సుమారు 100 తులములు గలది.

కొప్పు : ఇది అమ్మవారికి చక్కని నాగుపాము అకారములో తయారు చేయబడినది. ఇది చాలా అందమైనది. దీనికి మధ్యలో నవరత్నములు పొదగ బడినవి. దీనిని విజయరామ గజపతి దానము చేసెను.[25]

ఇవన్నియు శ్రీ స్వామివారి సొమ్ములు. ఇవికాక మరెన్నో చిన్న చిన్న ఆభరణములు గలవని తెలియుచున్నవి.

శ్రీనాథుడు, ఎఱ్ఱాప్రెగడ, ప్రబంధకాలము నాటి రాయలు, అల్లసాని పెద్దన, పింగళి సూరన సింహగిరిని గూర్చి తమ తమ కృతులలో ప్రస్తావించిరి.

సింహాద్రి నారసింహ శతకాన్ని శ్రీ గోగులపాటి కూర్మనాధ కవి రచించెను. ఇది వ్యంగ్య రచన. ఈ కవి ఆరువేల నియోగి, అపస్తంబసూత్రుడు, గౌరమాంబ బుచ్చన్నలకు పుత్రుడు, సూరనార్యుని పౌత్రుడు. వెంకన్న, కామన్న లితని తమ్ములు. విజయనగర సమీప గ్రామమైన రామతీర్థము వీరి నివాసము. క్రీ. శ. 1720 సంవత్సరములో జన్మించి 1790 ప్రాంతమున దేవులపల్లి గ్రామములో పరమపదించినట్లు తెలియుచున్నది. అడిదము సూరకవి, చత్రాతి లక్ష్మీనృసింహ కవులు ఇతని సమకాలికులు.

ఇతడు విజయనగర దేవస్థాన కాలమందు ఉద్యోగిగా యుండి, రామతీర్థము, పద్మనాభము, సింహాచలము, శ్రీకూర్మము మొ॥ స్థలములలో నున్నట్లు చరిత్ర వలన తెలియుచున్నది.[26]

---

25. శాసనము అనుబంధములో గలదు.
26. సింహాద్రి నారసింహ శతకము - పీఠిక లక్ష్మీనరసింహరాజు.

ఇతడు విజయనగర ఆస్థానకవి అని కూడ తెలియుచున్నది.

ఈ కవి రచనలు నాలుగు కనిపించుచున్నవి. ఇందులో చివరిది అసమగ్రము - అముద్రితము కూడ.

1. మృత్యుంజయ విలాసము (యక్షగానము)
2. సింహాద్రి నారసింహ శతకము
3. లక్ష్మీ నారాయణ సంవాదము (ప్రబంధము)
4 సుందరీమణి శతకము

సింహాద్రి నారసింహ శతకము శ్రీస్వామిని ఎత్తిపొడుస్తూ హెచ్చరికలు చేస్తూ - ఆర్తి ఆవేశములతో "వైరిహరరంహ సింహాద్రి నారసింహ" అనే మకుటముతో వ్రాయబడినది. ఇతని మాటలు విని పులకించిన స్వామి గుడిపై బడిన తురుష్కుల దాడిని కంచు తుమ్మెదల రూపముతో చీల్చి చెండాడి విశాఖ యందలి తుమ్మెదల మెట్టవరకు తరిమి చంపినట్లు గలదు [27]

ఇలాంటి స్తుతి ప్రధానములైనవి శ్రీ ముడుంబై నరసింహాచార్యగారు వెలయించినారని తెలిసినది. కాని నాకు లభింపలేదు.

## శతకమును రచించుటకు గల కారణములు :

క్రీ.శ. 1753 సం॥లో దక్కను (దక్షిణ) సుబేదారగు సలాబత్‌జంగ్ ఉత్తర సర్కార్లు "బుస్సీ"కి కౌలుకిచ్చెను. కౌలు స్థానములను స్వాధీనపరచు కొనుటకు పరాసు "బుస్సీ" మచిలీపట్టణమునకు గవర్నరు "మారిసన్" అను నతనిని రాజమహేంద్రవరము శ్రీకాకుళ సర్కారులకు పంపెను. కాని శ్రీకాకుళములో ఫౌజుదారు (GOVERNOR) గానున్న "జాఫరల్లీఖాను"నకు ఈ విషయ మిష్టములేదు. అందుచే బలవంతుడగు "విజయరామ గజపతి"తో సంధి

---

27. సింహాద్రి నారసింహ శతకము - కూర్మనాథకవి.

చేసుకొని ఇతని సహాయమున శ్రీకాకుళ రాజమహేంద్రాదులను ఏకచ్ఛత్రాధిపత్యముగా సర్కారుల నేలదలచెను.

''మారిసన్'' ఈ సంగతి గ్రహించి ముందుగానే తాను ''విజయరామ గజపతి''తో సంధి చేసుకొనెను. జాఫరల్లీ ఈ సంగతి తెలిసి శ్రీకాకుళము వదిలి పారిపోయెను. కాని జాఫరల్లీ విజయరామ గజపతి పైనను, ఫ్రెంచివారి పైనను పగ సాధింప నెంచి, అప్పటికే ఫ్రెంచి వారితో యుద్ధము చేయుచున్న నాగపురాధీశ్వరుడైన 'రఘోజీభాంస్లే' అను మరాఠి నాయకుని వద్దకు ప్రయాణమై పశ్చిమ మార్గమున పోవుచుండ మార్గమధ్యమున సేనా సమేతుడై పోవుచున్న రఘోజీ కుమారుడు కన్పించెను. అపుడు ''జాఫరల్లీ'' అతనిని ప్రతిమాలి, ఆ సైన్యముతో శ్రీకాకుళము సర్కారునకు కొండమీదుగా రమ్మనెను. అపుడు సైన్యముతో కొంత అశ్వదళము కొండలమీదుగా పయనమైనది. ఆ కొండల మార్గమును జూపుటకు "పాచిపెంట" జమీందారు "వీరప్ప దొర" వారికి తోడ్పడెను.28 అందులో మహారాష్ట్రులు, తురకలును గలరు. మహారాష్ట్రులు గ్రామములను దోచుకొనుచుండగా, తురకలు దేవాలయాలపైబడి పడగొట్టసాగిరి. అప్పటికి విజయరామ గజపతి రాజు యజాగ్రత్తగా యుండి తన సైన్యముతో వారి నెదుర్కొనెను. కాని చాలని సైన్యముతో తిరిగి వెళ్ళి పోయెను.

క్రమముగా ఆ సైన్యము సింహాచలమునకు చేరుచుండెను. ఈ వార్త తెలిసిన దేవస్థానోద్యోగులును, భక్తులును అగు "అదుర్తి హరిహరదాసు" "గోగులపాటి కూర్మనాథుడు" అను వారిరువురును స్నానసమాచరించి దేవాలయ గర్భగుడిలో ప్రవేశించి తలుపులు బిగించుకొని ఈ శతక రచనకు పూనుకొనిరి.

"గోగులపాటి కూర్మనాథుడు" ఆశువున నీ శతకమును చెప్పుచుండగ తిరిగి యడుగకుండ గంటము చేతపట్టి తాటియాకులపై "హరిహరదాసు" వ్రాసెను.

---

28. విశాఖ చరిత్ర - పుట 64-67

ఈ శతకము ముందుగా దూషణ భాషణములతోను - తిరస్కార ములతోను ఆరంభమై, తరువాత క్షమాపణలతోను ప్రార్థనలతోను ముగిసినది.

తురకల దండు (సైన్యము) కొండపైకెక్కి గోపుర కట్టడములను కూల్చ సాగినది. ఆవరణయందలి రాతి రథమునందుగల అశ్వములను భంగము చేసిరి. ముఖ్యాలయ ప్రవేశము జరుగకముందే కంచు తుమ్మెదలు పుట్టి తురకల దండును తుమ్మెదల మెట్టవరకు (విశాఖపట్టణమందు గలదీ వీథి) తరిమి చంపినవి.

తరువాత విజయరామ గజపతి సైన్యమును క్రమంగా సనుకూర్చుకొని రఘోజీ సైన్యములను అనకాపల్లి దరితుమ్మపాలవద్ద ఎదిరించి వారిని ఓడించి సింహాచలము చేరి అసలు విషయము గ్రహించెను. అప్పటికే త్రోవలో అశ్వ ములు, సైన్య కళేబరములు, ఆశ్వికుల మొండెములు కన్పించెను.

పై కారణము వలన సింహాచలము చేరిన తరువాత కవుల ఘనత యనీ నిజము గ్రహించిన గజపతి కూర్మనాథకవికి "రామతీర్థము"ను అగ్రహారముగా నిచ్చెను. అట్లే శతకము వ్రాసిన "హరిహరదాసు"కు "నిమ్మల పాలెము"ను అగ్రహారముగా నిచ్చెను.

(See Feezro committee accounts of the respective villages prepared in A. D. 1835)

నేటికిని హరిహరదాస కుటుంబీకులకు స్వామివారి కల్యాణమునందు నాల్గవ దినమున కొంత సొమ్ము యిచ్చే ఆనవాయితీ గలదు 29.

ఈ శతకములో శ్రీ కూర్మనాథకవి సింహాద్రి నాథుని ఆక్షేపణలతో, ఆవేదనలతో, స్తుతినిందలతో, ప్రార్థనలతో, ఆలాపనలతో కూడిన 101 పద్య

29. కూర్మనాథ నరసింహ శతకము - పీఠిక - చాట్ల లక్ష్మీనరసింహరాజు. పుట - 7.

ములు వ్రాసినాడు. "వైరిహరరంహ। సింహాద్రి నారసింహ" అను మకుటముతో వ్రాసెను. "వైరి హర రంహ" "అనగా శత్రువులను సంహరించుటకై వేగము గలవాడా" అని అర్థము. ఇచట శత్రువులు గుడిపై దాడి చేయుచున్న వారు తురకలు కావున నిన్ను ముట్టడించే వారిని వేగముగా సంహరించుమని వేడుకొన్నాడు. లేనిచో నిన్ను నీవు కాపాడుకొనుము. అట్లు కానినాడు మమ్ము నీవెట్లు కాపాడగలవు అని వ్యంగ్యముగా తిట్టి పోతలతో రచించెను. తన మనో వేదన వలన స్వామిని నిందించుటతో గూఢస్తుతి నిందతీరు మిక్కిలిగా సముచితమైనది.

ఈ దేవాలయమునకు యవనులు, తురుష్కులు, పాశ్చాత్యులు మున్నగు శత్రువులవలన ప్రబలమగు విపత్తు సంభవించనున్న సమయమున భయ, భావ భక్త్యావేశమున ఉద్వేగముతో కూర్మదాస కవి హృదయము నుండి సింహాచలము నందలి గంగాధారవలె ఆశుకవితాధార రూపమున వెలువడి - శతక రూపము దాల్చినది.

దీనిని పాఠకుడు మొదటి నుండి తుదివరకు శరవేగముగా పఠింప వలసిందేగాని, ఆగవలసినది కాదు. భగవంతునకు తన బాధను నివేదించు భక్తుడు తొలుత ఆ దేవున్ని సుముఖునిగా చేసుకొనుటకు కవి కూర్మనాథుడు చేసిన ప్రయత్నము ఆది పద్యాలలో కన్పడును.

*సీ॥ శ్రీమద్రమారమణీ మణీరమణీయ
సరస చిత్తాబ్జబంభర । పరాకు
శంఖచక్రగదాసి శార్ఙ్గచాపాది భా
సురదివ్య సాధనకర । పరాకు

* సింహాద్రి నారసింహ శతకము - కూర్మనాథకవి.— పద్యము - 1, 1983. దేవస్థానము ప్రచురణ.

ప్రహ్లాద నారద వ్యాస శుకాదిక
భక్త సంరక్షణపర । పరాకు
బహుతర బ్రహ్మాండ భాండపరంపరా
భరణ లీలా ధురంధర । పరాకు

తే॥గీ॥ నీకు సాష్టాంగ వినతు లనేక గతుల
జేసి విన్నప మొనరింతు జిత్తగింపు
చెనటి పీడని మదిలోన గినుక మాని
వైరి హరరంహ సింహాద్రి నారసింహ।*

ఓ శ్రీహరీ నీవు "రమణీమణీ కమనీయ సరస చిత్తాబ్జబంభర" పరాకు అని భక్తుడు చెప్పుట చేత నిట రమణితో నీవు కేళు లాడుట తగదు. ఇది సమయము కాదు. కనుక వేగమే తరలి వచ్చి శత్రువుల చీల్చి చెండాడుమని శంఖ, చక్ర, గదా, అసి మున్నగు వానిచే భాసిల్లె నీ చేతులతో కదలి రమ్మ అని భావము.

ప్రహ్లాద, నారద, వ్యాస, శుకాది భక్తుల రక్షించిన నీవు నన్ను కాపాడు కోలేవా? దేవదేవా! ఈ బ్రహ్మాండములు లెక్కలేనివిగను, తెంపు లేనివిగను నున్నవి. ఒక్కొక్క బ్రహ్మాండము నందు పద్నాలుగు (14) లోకములున్నవి. ఒక్కొక్క బ్రహ్మాండము నీకొక్క భాండముగ తోచుచున్నది. ఇట్టి బ్రహ్మాండ ములను భరించుట నీకొక లీలగా నున్నది. అటువంటి లీలలెన్నింటినో నీవు భరించు చున్నావు. అట్టి నీకొక లెక్కనా ఇది? నీ ఆలయాన్ని రక్షించుకొనుట నీకొక భారమా? అని ధ్వనిగా, వ్యంగ్యముగా భక్తి భావము ధ్వనియందు పర్యవసానము నొందు చున్నది. కనుక నిది ప్రధానమగు భావధ్వని గల కావ్యము. ఇట్లే అన్ని పద్యాలలోను భావధ్వనియే గోచరించుచుండును. వ్యంగ్య

* సింహాద్రి నారసింహ శతకము-కూర్మనాథకవి-ప. 1

భావములను 'గని'గా గల శతకము. ధ్వనులకు నిలయమే. పలుసార్లు "పరాకు" అనే పదము వాడుటలో కవి భగవంతుని ఆలస్యము చేయక వేగమే రమ్మని వేడుకొనుట స్పష్టముగా కనబడుచున్నది.

రెండవ పద్యమున ఎల్ల దేవతలు రాత్రింబవళ్ళు స్థితిగతుల తెల్పెడి రవి, సోము లిచట నిల్చిరి. మందారాది వృక్షముల గొని ఇంద్రుడేతెంచినాడు. వీరికి మీ యాజ్ఞ ఏమిటి? కిన్నర, కింపురుష, గంధర్వాదులు చేత వీణలు ధరించి దర్శనమునకు వచ్చిరి అని జయ విజయులు శ్రీహరికి తెలిపిరి. కానీ నీవు మాత్రము హాయిగా ఇందిరను గూడియుంటివి. 'ఇంటి' కన్న గుడి పదిలము గదా! యవనులను చెండాడి గొట్టవయ్యా అని భగవంతుని కూర్మనాధుడు ప్రార్థించెను. ప్రబంధ కాలములో సింహాచలాన్ని దర్శించవచ్చి చూచిన తరువాత రాయలు తన ఆముక్తమాల్యదలో (6 ఆ.189 పద్యములోను)-

మ॥ ఇది సింహాచల.............బొల్పగున్.

అని సింహాచలమందలి నృసింహస్వామి పాదపూజల యొక్క పుణ్యము చేత లభించినది. చెప్పుటకు వీలుకాని విషయము స్తంభము యొక్క శిలయందు చెక్కబడినది. అది దృఢమై అష్టాక్షరములు గల కృష్ణరాయని కాంతి, ఆముక్త మాల్యదయందు వినసొంపుగా సింహాద్రి భూమిపై ప్రకాశించునని చెప్పెను.

కళాపూర్ణోదయమునందు పింగళి సూరన (2 ఆ. 128 ప.)
సీ॥ ఇత్తెరంగున..................స్వాంతుడగుచు.

అని సింహాద్రి స్వామిని పొగడినాడు.

ఇందు వరహా, శారద, గోస్తనీ, చంపావతీ, వేగావతి అనే నదులును, సింహగిరి, రామగిరి, పద్మనాభగిరి, అనంతగిరి, పుణ్యగిరి అనే పర్వతాలు గలవనియు గలదు.[30]

ఈ క్షేత్రమును ప్రహ్లాదుడు ప్రతిష్ఠించెను. సాధారణముగా విష్ణు విగ్రహములు ఆలయపు గోడల నంటియుండును. శైవలింగమూర్తు లాలయ మధ్యభాగమున ప్రతిష్ఠితము లగుచుండును. సింహాచలమున వరాహముఖాకృతి గల విగ్రహము ఆలయ మధ్యభాగమున నున్నది. చందనపు పూతచే దర్శన మాత్రమున లింగాకృతియే మొదట కన్పడును.[31] దీనినిబట్టి ఇది యొకప్పుడు శివక్షేత్రమై యుండెనేమోయని సందేహము కలుగక మానదు.

శాసనములనుబట్టి పూర్వం చాళుక్యుల కాలమున యనగా ఏడవ శతాబ్దమునకు పూర్వమే ఈ ఆలయము కట్టబడినట్లు తెలియుచున్నది. బహుప్రాచీనమైన వాయుపురాణములో నీ 'సింహగిరి' పేర్కొనబడినది. కావున ఇది పురాణ క్షేత్రమని ఒప్పుకొనక తప్పదు.[32]

క్రీ. శ. 11వ శతాబ్దమున కట్టబడిన ముఖ మంటపాదులకు నల్లరాయి సింహాచలమునకు పదిమైళ్ళ దూరమునగల పెందుర్తి కొండనుండి తీయబడినది. గొప్ప పాషాణము లిచట గలవు. వాటికి "అపామార్గతైలము" ముఖ్యమనియు రాత్రి తైలము పూసిన తెల్లవారేసరికి నునువుగా నుండుననియు ననుభవజ్ఞులు చెప్పియుండిరి.

---

30. కళింగదేశ చరిత్ర - శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు - పుట 58
31. కళింగదేశ చరిత్ర - శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు - పుట 58
32. కళింగదేశ చరిత్ర - శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు - పుట 59

సింహగిరీంద్రుని దేవాలయ ప్రహరీగోడలు సుమారు ఒక మైలు చతురము గలిగి హనుమంతునిచే రక్షింపబడుచున్నవి.[33] పూర్వము ఈ ప్రహరీ గోడకు (24) ఇరువదినాలుగు బురుజులు గల్గియుండెనని పెద్దలు చెప్పుదురు.

గాంగవంశీయుడు నృసింహరాజుచే క్రీ. శ. 11వ శతాబ్దమున గట్టింపబడిన ముఖమంటప "దేవరహస్యము"లో గొంక దంపతులు, అనంతవర్మ సంతానము, శ్రీకృష్ణదేవరాయలు ఇంకా మరెందరో మహారాజులు సింహాచల దర్శనము గావించి, నవరత్నహారములు, బంగారు పాత్రలు, కిరీటములు దానము చేసినట్లు తెలియుచున్నది. ఇవి పిండారుల దండు కాలమున చెల్లిపోయినట్లు కనబడుచున్నది.

---

33. కళింగదేశ చరిత్ర - శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు - పుట 59

34. కళింగదేశ చరిత్ర - శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు - పుట 59

# ద్వితీయ ప్రకరణము

## కూచిమంచి తిమ్మకవి కాలము

శ్రీ కూచిమంచి తిమ్మకవి సహస్రమాస జీవియని బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు చెప్పియుండిరి. ఇతని రచనల కాలమునుబట్టి వయస్సును లెక్కింపవచ్చును. మొదటి రచన క్రీ. శ. 1705 సంవత్సరమున (రాజశేఖర చరిత్ర) వ్రాయబడినది.[1] చివరి కావ్యము శివలీలా విలాసము క్రీ. శ. 1756 సంవత్సరములో 31 దినములలో రచించినట్లు కవి తన గ్రంథములోనే చెప్పెను. కవి తన కావ్యములలో కొన్నింటికి రచనా కాలమిచ్చెను. కొన్నింటిలో కాల నిర్ణయము లేదు. సహస్రమాసజీవి యనుట వలన నితడు 83 సంవత్సరముల 4నెలలు జీవించియున్నట్లు విదితమగును. మరి అప్పటికి అనగా రాజశేఖర చరిత్ర రచనా కాలము (1705) నకు 20 సంవత్సరముల ప్రాయము వాడనుకొన్నను, చివరి కావ్యము శివలీలా విలాసమగుట చేతను (క్రీ. శ. 1756) ఈతడు క్రీ. శ. 1685 నకు చెందినవాడగును. క్రీ. శ. 1700-1760 అని శతక వాఙ్మయ పరిశోధక కర్త చెప్పిరి.[2] పై సంవత్సరముల జీవితకాలము క్రీ.శ. 1756 సంవత్సరములో రచించిన శివలీలా విలాసము తరువాత చనిపోయినట్లు ప్రతీతి. అనగా అప్పటికి వీరి వయస్సును పై మాట ప్రకారము క్రీ. శ. 1674 సంవత్సరమున జన్మించి యుండుననియు, క్రీ. శ. 1757 సం॥లో చనిపోయినచో అప్పటికి 83 సంవత్సరముల 4 నెలల వయసు వాడగును.

ఏది ఏమైనను కవి తిమ్మన తన రచనలలో ఒక్కొక్క కావ్యమును ఒక్కొక్కసారి ముందు వెనుకగా పేర్కొనుట జరిగినది.

---

1. ఆంధ్ర కవుల చరిత్ర.
2. అధిక్షేప శతకము - కీ॥ శే॥ కే. గోపాలకృష్ణారావు

తిమ్మకవి సమకాలికులలో పేరెన్నిక గన్నవారు కొందరున్నారు కాని ఈ కవి జన్మకాల నిర్ణయము లేదు. ఆ కవులు ఏనుగు లక్ష్మణకవి, వక్క లంక వీరభద్రకవి, ఈదులపల్లి భవానీ శంకరకవి, కూచిమంచి జగ్గకవి (వీరి తమ్ముడు).

తిమ్మకవి కవిత్వమును గూర్చి ఏనుగు లక్ష్మణకవి ఈ క్రింది విధంగా చెప్పినట్లు ప్రతీతి:

కం॥ హాటక గర్భ వధూటీ
లాటన చలితాంఘ్రినూపురారావ శ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్

అని పొగడెను.[1]

తిమ్మకవి జగ్గకవులు బాల్యదశలో నున్నపుడు, వీరి తల్లి తిమ్మనకు స్నానముచేయ నిశ్చయించి "అభ్యంజనము" చేయుచు, నెత్తిన చమురు పెట్టి అంతలో ఇంటిపనిలో నిమగ్నమైపోయినది. అట్టి సమయమున కుక్కుటేశ్వర స్వామి వృద్ధరూపమున వచ్చి యా బాలు నెత్తుకొని ముద్దాడి, తన వృద్ధ బ్రాహ్మణ రూపమున పొడ సూపి, ఇరవై కణుపుల చెఱకుగడను తిమ్మన కిచ్చి తినుమని చెప్పి అదృశ్యమయ్యెను. అప్పుడు జగ్గన అన్నను చూచి తన కిమ్మనగా అందులో అర్ధభాగము తిమ్మన జగ్గన కిచ్చెను. ఈ కథ నిజమో కాదో లోక మున ప్రతీతి.[2] ఈ విధంగా తినుటవలన వీరిద్దరికి మాధుర్యమైన తేనెలొలుకు కవిత్వము అబ్బినదని లోకమున కథ మాత్రము చరిత్రలో నిలిచిపోయినది.

జగ్గకవి తన అన్నను గూర్చి చంద్రరేఖా విలాప కావ్యగద్యమందు — "ఇది శ్రీ మజ్జగన్నాథ దేవ కరుణా కటాక్ష వీక్షణాను సంలబ్ధ సరస కవితా విచిత్ర——కూచిమంచి కుల పవిత్ర గంగనామాత్య పుత్ర మానితా మాన సమాన నానావిధ రంగ త్రిలింగ దేశ భాషా విశేష కవితా విలాస భాసురా ఖర్వ సర్వ లక్షణా సార సంగ్రహోద్దామ శుద్ధాంధ్ర రామాయణ ప్రముఖ బహుళ ప్రబంధ నిబంధన బంధుర విధాన నవీన శబ్ద శాసన బిరుదాభిరామ తిమ్మకవి సార్వభౌమ సహోదరుడ"నని చెప్పెను.

---

1. రుక్మిణీ పరిణయము - పీఠిక
2. రసిక జనమనో - పీఠిక.

తిమ్మకవి ప్రతి నిత్యము తన నివాసమైన కందరాడనుండి పిఠాపురము వచ్చి శ్రీ కుక్కుటేశ్వర స్వామిని సేవించి వెళ్ళేవాడని తెలియుచున్నది. తన అవసాన దశయందు భార్యా వియోగము సంభవించుటచే నితడు శేష జీవితము పిఠాపురమునందే గడపి, ఆలయమందే సిద్ధి నొందెనని జన శ్రుతి గలదు.

కందరాడ గ్రామ శివారునుండి విదేశ సైనికులు రాకపోకలు గావించు చుండిరి. ఇది తమ్మునకు బాధగా నుండి ఇతడు ఇటనుండి చంద్రమపాలెంనకు వలస పోయినట్లును గలదు.[1]

## తిమ్మకవి వంశవృక్షము :

బయ్యన మంత్రి



1. పెదరంగన 2. చినరంగన 3. లక్ష్మయ్య 4. తిమ్మమంత్రి (ప్రధాని)



దేచన భార్య వ్యాసుడు
చెల్లాంబిక
అచ్చన మంత్రి



1. పెదరంగన 2. రంగశాయి 3. నృసింహుడు 4. రామరాజు 2. చినరంగనకు



1. నరసమాత్యుడు 2. చిన్న ప్రధాని 3. పట్టినామాత్యుడు
3. లక్ష్మయ్యకు



బయ్యన
తిమ్మన భార్య రాజమాంబ



గంగనామాత్యుడు జగ్గ ప్రధాని సింగనామాత్యుడు నారసింహుడు
భార్య అచ్చమాంబ



తిమ్మన భార్య బుచ్చమ సింగన జగ్గన సూరన.

1. రసి. మనో. పీఠిక.

## తిమ్మకవి కృతులు

| | | | సం॥లు |
|---|---|---|---|
| 1. | రాజశేఖర చరిత్రము | ... | 1705 |
| 2. | రుక్మిణీ పరిణయము | ... | 1715 |
| 3. | నీలాసుందరీ పరిణయము | ... | 1715 |
| 4. | శ్రీ సింహాచల మాహాత్మ్యము | ... | 1719 |
| 5. | ఖడ్గ శతకము | ... | 1729 |
| 6. | సారంగధర చరిత్రము | ... | 1729 |
| 7. | సప్త సాగర చరిత్రము | ... | 1729 |
| 8. | అచ్చతెనుగు రామాయణము | ... | 1729 |
| 9 | సర్వలక్షణ సార సంగ్రహము | ... | 1740 |
| 10. | రసికజన మనోభిరామము | ... | 1750 |
| 11. | సర్పపుర మాహాత్మ్యము | ... | 1754 |
| 12. | శ్రీ శివలీలా విలాసము | ... | 1756 |
| 13. | శ్రీకృష్ణ దండకము | ... | |
| 14. | చిరవిభవ శతకము | ... | |
| 15. | కుక్కుటేశ్వర శతకము | ... | |

## వివరములు

### 1. రాజశేఖర చరిత్రము :

ఇది మూడాశ్వాసముల చిన్న కావ్యము. ఇందలి పద్యములు 541. ఈ కావ్యము నందలి కథ:

సింధుకటకమును భల్లాణుడను రాజు పాలించు చుండెను. అతనికి ఇద్దరు భార్యలు - చల్లాంబికా మల్లాంబిక అనువారు. రాజు శైవుడు. శివ వ్రతము చేసి భక్తుల మెప్పింపకోరి, వారి కోర్కెల మేరకు తగిన సదుపాయంబులు కలుగ చేసెను. విషయము తెలిసిన దేశమందలి జంగాలు 'లింగధారులై రాజును

సమీపించిరి. ఇది విన్న కైలాసవాసులు భక్తభల్లాణుడు చేయు వ్రతము పరీక్షింప గోరి సింధు దేశమును చేరిరి. స్వయముగా శివుడుకూడ అచటికి వచ్చియుండెను. సిద్ధుని రూపములోని శివుడు విటుడు లేని వేశ్యను కోరెను. భక్త భల్లాణుడు సరేనని ఒప్పుకొనెను. శివుడు వేశ్యవాటికలో చేరి అందరితోడ క్రీడించుచుండెను. ఒక్కరు కూడా ఒంటరిగా లేరైరి. శివునకు అప్పుడు భల్లాణుడు విటుడులేని వేశ్య లేదని చెప్పెను.

వేశ్యలేనిది తాను భుజింపనని చెప్పగా భల్లాణుడు తన పట్టమహిషిని పరమేశ్వరున కర్పితముగా పంపెను. అప్పుడు శివుడు చల్లాంబిక ముందు బాలుడై నిల్చి ఆ దంపతులను కైలాసమునకు గొనిపోయెను. (రాజశేఖరునికే భల్లాణుడని పేరు)

## 2. రుక్మిణీ పరిణయము: *

ఇది తిమ్మన కృతిలో రెండవది. ఇందులోని పద్యాలు పీఠికతోసహా 713 గలవు. ఐదాశ్వాసముల గ్రంథము. ఇందలి కథ :

కుండిన పురమునకు రాజు భీష్మకుడు. ఇతని పట్టపుదేవి యందు అయిదు గురు పుత్రులుదయించిరి. ఒక పుత్రిక కూడ జన్మించెను. ఆమెయే రుక్మిణి. రూపగుణ యౌవనవతియగు బిడ్డకు పెండ్లి చేయదలచి, బుధజనుల వలన విచారించగా వారు శ్రీకృష్ణుడే తగిన వరుడని చెప్పిరి. కాని ఆమె అన్నయగు రుక్మి (మొదటివాడు) కృష్ణునియెడ విముఖుడై యుండి, శిశుపాలునకీయ దలచెను. భీష్ముడు జ్యేష్ఠ పుత్రుని మాట కాదనలేక శిశుపాలునకు వార్త నంపెను. ఇది తెలిసిన శిశుపాలుడు కుండినపురమునకు చేరెను. కాని ఇష్టము లేని పెండ్లికి విందులు మెండని భావించిన రుక్మిణి పురోహిత పుత్రుని ద్వారా శ్రీకృష్ణునకు వార్త పంపెను.

---

* రుక్మిణీ పరిణయము - కూచిమంచి తిమ్మన.

శ్రీకృష్ణుడు బలరామ సహితుడై వచ్చెను. అప్పుడు రుక్మిణి గౌరీదేవి గుడికేగి దేవితో తన విన్నపము లాలపించెను. దేవి రుక్మిణికి కృష్ణునకు పెండ్లి గావింప అనుగ్రహించెను. కృష్ణ రుక్మిణిలకు గాంధర్వమున వివాహము జరిగెను. ఇది భాగవతమున (పోతన) 105 పద్యాలతో నుండగ, తిమ్మన 713 పద్యాలకు పెంచి రసవత్తర శృంగార ప్రబంధ రీతిలో తీర్చిదిద్దెను.

### 3. శ్రీ సింహాచల మాహాత్మ్యము : *

ఈ కావ్యము 944 గద్యపద్యములు గల్గి, 254 పుటలతో నిండి యున్నది. ఇందులో కవి తన వంశవృక్ష వర్ణనలు విపులము గావించెను (40 పద్యాలలో గలదు 1. ఆ-12-52 వరకు) దీనివలన కూచిమంచి వారు కవులు, పండితులు ధీమంతులు, అమాత్యులు, శివభక్తులు, సప్త సంతాన పోషకులు, కవి సార్వభౌములుగా విఖ్యాతిగాంచిరని తెలియును.

ఇది క్షేత్రమాహాత్మ్యమగుటచేత కథ సాఫీగ సాగదు. నృసింహుని 400 స్థానములు గలవు. వీటిలో ప్రఖ్యాతమైనవి అహోబిలము, కృత శౌచము, హరింపావనము, సింహాచలము అనునవి ముఖ్యము. హిరణ్యకశిపుని చంపుటకై నృసింహుడు 1. అహోబిలమున పుట్టి 2. హరింపానమున బిడాల నృసింహుడు 3. కృత శౌచమున యోగానందమయి నరహరి వెలిసెను. 4. సింహాచలమున శాంతరూపమున సింహాకారములో వెలసెను. అహోబలస్వామి హిరణ్యకశిపుని సంహరించి ఆ రుధిరమును కృతశౌచమున కడిగి, హరింపావనమున నివసించి, సింహాచలమున వెలసెను. ఈ నాలుగు క్షేత్రములు ప్రదక్షిణము చేసినచో, భూప్రదక్షిణ చేసిన మోక్షము లభించును. భాగవతము - నృసింహ పురాణము, హరివంశములలో వలె కాక ఇందలి కథ ఎగుడుదిగుడుగా సాగినది.

---

* శ్రీ సింహాచల మాహాత్మ్యము - కూచిమంచి తిమ్మన.

**4. నీలా సుందరీ పరిణయము : ***

ఇది మూడాశ్వాసముల కావ్యము. ఇందలి గద్య పద్యముల సంఖ్య 359. ఈ కవి అచ్చ తెనుగు కావ్యములలో మొదటిది.

ఇందలి వర్ణనలు అష్టాదశలతో వెలసి, మూలమైన హరివంశ కథ 50 గద్య పదములకు తిమ్మన 359 చేసెను. ఈ కథలో వీర, అద్భుత, శృంగార రసమయమై ప్రబంధ రీతిలో నడిచినదీ కావ్యము.

కథ : ధర్ముడను రాజు మిథిలానగరమును పాలించుచుండెను. ఆ నగరము నందే కుంభకుడను గొల్లదొర కలడు. అతని భార్య ధర్మద. వీరికిద్దరు సంతానము. కొడుకు సిరిదాముడు. బిడ్డ నీల. ధర్ముడు దానధర్మపరుడు. నీలకు పెండ్లి వయస్సు వచ్చెను. నందుని బావమరిది కుంభకుని యోగక్షేమ సమాచారము లరయుటకై ఒక విప్రుని పంపెను. అతడు శ్రీ కృష్ణుని లీలలను యశోదా నందుల విషయమును విపులముగా తెలిపెను. కుశలవార్త తదుపరి బ్రాహ్మణుడు నీలను గూర్చి కుంభకునికి సందేశ మెఱిగించెను. నందుడు ఆమోదము తెలిపెను. నీలా సౌందర్యమును కృష్ణునకు వలపు జనింప వర్ణించెను.

ఈ సమయముతోనే కుంభకుని ఇంట కాలనేమియను సుతులాబోతులై జన్మించిరి. వీరు పూర్వము కృష్ణుని చేతిలో మడసి మరుజన్మలో నాబోతులై మిథిలా నగరమున ప్రవేశించిరి. కొమ్ములతో కుమ్ముచు బాధించు చుండిరి. ప్రజలు ధర్మునకు ఈ బాధ విన్నవించిరి. రాజు కుంభకునికీపని నప్పగించెను. కుంభకుడు బలశాలుర నియమించగా వారిని కూడ ఆబోతులు ఓడించుటయు చివరకు రాజు ఆబోతులను పట్టినవారికి తన కూతురునిచ్చి పెండ్లి గావించెద నని చాటించెను. నీలకు కృష్ణునిపై, కృష్ణునకు నీలపై మక్కువగల్గియుండిరి.

---

* నీలా సుందరి పరిణయము - కూచిమంచి తిమ్మన.

అట్టి యెడ అబోతుం బట్టిన వారికి తన కూతురునిచ్చి వివాహము గావించెద నన్న చాటింపు విని కృష్ణుడు ధైర్యముతో అబోతుం వధించెను. అపుడు ధర్ముడు నీలనిచ్చి పెండ్లి గావించెను. ప్రజలు సుఖముగా జీవించిరి.

### 5. అచ్చతెనుగు రామాయణము: *

ఇందలి గద్యపద్యాల సంఖ్య 1328. పీఠిక షష్ఠ్యంత్యములు 26 గలవు. ఈ రామాయణము వ్రాయుటకు గల కారణమును కవి చూపిన పద్యము:

తే॥ అనుచుదెల గంటితపసి రామాయణంబు
నీళ్ళరాయనిగాదిలి నిసుగు తోడ
దెలిపెనిది విన్న వ్రాసిన లలిజదివిన
సిరులు గోర్కులుబున్నెంబుజెందు బజల

(అ. తె. రా. - యుద్ధ - 593)

కవి అచ్చతెనుగు రామాయణము వ్రాయుటకు గల కారణము —

తే॥ తెనుగు చదువుంబున్ని యంజెంన యదనుచు
గొందఱాడుదురాడిన గొఱతయేమి
మును 'మరా' యంచు నుడివిన చెనటిబోయ
నెఱనిరాబారి యగుటయె గుఱుతుగాదె.

(అ. తె. రా. యుద్ధ - 594)

పై పద్యములవలన లోకమందలి రామాయణ విశిష్టతను ఊహింపవచ్చును. వింత-వింత పద్యములు అచ్చతెనుగులో చూపెను. కథలో వర్ణనలు, సంభాషణములు మూలానుసారముగా లేవు. అవాంతర కథలు గూడ కొన్ని కలవు.

---

* అచ్చతెనుగు రామాయణము - కూచిమంచి తిమ్మన.

### 6. సర్వలక్షణ సార సంగ్రహము :[1]

కవి దీనిని లక్షణసార సంగ్రహమనియు నుడివెను. ఇతడు నన్నయాది కవులు చేసిన వ్యాకరణాదుల్లో లేనివి కొన్ని మార్పుచేసి నూతన లక్షణములను చూపెను. ఇతడు 'ఇ'కారమునకు వికల్పసంధి చెప్పెను. వ్యాకరణము, యతి ప్రాసలు, రేఫ, అకార ప్రయోగములు పరిశీలించెను. ఇందులో తత్సమ, తద్భవాది విభాగములు తొలుత చేయబడెను.

తిమ్మకవి శబ్దము యొక్క రూపాంతరములు లక్షణములలో చూపిన విధము:

క. పూవు పువు పువ్వు పూయన
మామిడి మావిడి యనంగ మావియనంగా
దౌవుదవు దవ్వు దౌయన
గావెలయుం గృతులయందు గౌరీరమణా!

అని తన లక్షణ గ్రంథము 2. ఆ. 176 పద్యములో చూపెను. 'ఋ' కారమును రేఫముతోడ ప్రాస చేసినాడు.

### 7. సారంగధర చరిత్రము :[2]

ఇది రెండాశ్వాసముల విషాద కావ్యము. ఈ కథకు ఇతివృత్తము చేమకూర వేంకటకవి మరియు బాణాల శంభుదాసకవి కృతములే కారణములై యుండవచ్చును. ఈ కథ పీఠికలో కందుకూరు వీరేశలింగంపంతులుగారు కవిని గూర్చి ఇట్లు పేర్కొనిరి: క్రీ.శ. 1757 సంవత్సరములో మృతి చెంది యుండవచ్చును. అదే పీఠికలో చెలికాని లచ్చారావుగారు కవిని గూర్చి 28-11-1920లో ఇట్లన్నారు: అచ్చతెనుగున నిరోష్ఠ్య నియమమునకు దారి తీసినకవి ప్రథముడు కూచిమంచి తిమ్మన. సారంగధర చరిత్రను శంకరునకు కృతి యిచ్చెను. ఇందలి పాత్రలలో చిత్రాంగిని వేశ్యగా చిత్రించినాడు.

---

1. సర్వ లక్షణసార సంగ్రహము - కూచిమంచి తిమ్మన.
2. సారంగధర చరిత్రము - కూచిమంచి తిమ్మన

శృంగార ప్రబంధ తీరులోనున్న కరుణ విషాదములతో కూడిన కావ్యము. ఈ కావ్య పీఠికలో కవిని గూర్చి చూపిన పద్యమొకటి—

1. చతురులలోన నెంతయును
జాణవటంచును నేనుగౌ గిలించితి నిట్టు
మూరుమోమిడగ।
చెల్లునె యోరసికాగ్రగణ్య -

అని తిమ్మన తన రసికతను వేశ్యభావమును చూపెను.

2. "యద్భుతమసనట్టి బంగరపు
బొంగరవుం గవబోలు నీకుచ
ద్వితయము త్రొమ్మ నాటియల।
వీపున దూచెనటంచు జూచితిన్

అని తాను వెనుదిరిగి చూచినప్పటి భావమిది.

## 8. రసికజన మనోభిరామము :*

ఇది మిక్కిలి మనోహరమైన ఆరాశ్వాసములు గల రసవత్తర ప్రబంధము. ఇందలి గద్య పద్యాల సంఖ్య 1011. ఈ కథకు మూలము బ్రహ్మ పురాణము అని స్వయముగ కవియే చెప్పెను. (రసిక-పంచ ఆ-207) గోదావరి ఖండము, వృద్ధసంగమ తీర్థవర్ణనము అనే మూలములో 36 అధ్యాయము లోనిది.

కథ: కల్యాణ పురమును అర్చిష్మంతుడను రాజు పాలించుచుండెను. ఇతనికి ఋతుధ్వజుడను నామాంతరము కూడ గలదు. ఇతని భార్య సుశ్యామ

* రసికజనమనోభిరామము - కూచిమంచి తిమ్మన.

వీరికొక కూతురు గలదు. ఆమెనొక గుహలో వదిలి, నీచెంతకేపురుషుడు ప్రథముడుగా వచ్చునో అతడే మగడని చెప్పి తల్లిదండ్రులు గంధర్వ లోకము చేరిరి.

ఆ మాట ప్రకారమే సుశ్యామ పుత్రిక గుహలో కొన్ని వేల యేండ్లు తపస్సు గావించెను. చివరకు గౌతముడను విప్రుడు ఆ గుహకు చేరెను. తన తల్లి వరము ప్రకారమే కాని అతడు వయఃపరిమాణము చాల దనెను. వాణి, వైద్యాగరుల ప్రార్థించి తగిన రూపము గావించుకొనెను. కాని వృద్ధాంగన యగుటచే లోకమున జనులు జూసి హేళన చేయసాగిరి. వారికి అగస్త్యు డొక ఉపాయము చెప్పెను. గౌతమీ, గంగను దర్శించి రమ్మనగా వారట్లే గావించిరి. ఆ జల స్నానమాహాత్మ్యము వలన యిద్దరును సమవయస్కులై కాలమును సుఖమయము గావించుకొనిరి.

## 9. శ్రీ సర్పపుర మాహాత్మ్యము : *

ఈ క్షేత్ర మాహాత్మ్యమునందు 386 గద్య పద్యములుగలవు. కవి దీనిని శ్రీ భావనారాయణస్వామి కంకిత మిచ్చెను. ఇందులో మూడాశ్వాసములు గలవు.

ప్రాచీన కాలమునుండి సవతిపోరు సరేసరి. అట్టివారిలో భారత కథ ద్వారా కన్పించె కద్రువ నాగమాత. ఈమెచే శపింపబడిన అనంతుడను కొడుకు త్రిమూర్తికై తపమాచరించి నిత్యము శ్రీహరికి శయ్యయగునట్లు వరము పొందెను. ఇతడు తపమాచరించినది అనంత సరస్సుగా ప్రసిద్ధి గాంచినది. దీనినే యిపుడు సర్పపుర (వర) మందురు. నారదుని మోక్షము గావించుటకై శ్రీహరి యిచట వెలిసెను.

కథ : బ్రహ్మదేవుడు నిండుసభలో కొలువుండగ నారదుడు నేనొక్కడినే విష్ణుమాయకు లొంగనని గర్వించెను. అంతట బ్రహ్మకు కోపమువచ్చి, నీవు గర్విష్ఠివి, విష్ణుమాయకు లోనగుమనియు, భూలోకమున స్త్రీవిగమ్మని శపించెను.

---

* శ్రీ సర్పపుర మాహాత్మ్యము - కూచిమంచి తిమ్మన.

శృంగార ప్రబంధ తీరులోనున్న కరుణ విషాదములతో కూడిన కావ్యము. ఈ కావ్య పీఠికలో కవిని గూర్చి చూపిన పద్యమొకటి—

1. చతురులలోన నెంతయును
జాణవటంచును నేనుగొ గిలించితి నిట్లు
మారుమోమిడగ।
చెల్లునె యోరసికాగ్రగణ్య -

అని తిమ్మన తన రసికతను వేశ్యభావమును చూపెను.

2. "యద్భుతమనపట్టి బంగరపు
బొంగరవుం గవబోలు నీకుచ
ద్వయత్వయము తొమ్ము నాటియల।
వీపున దూచెనటంచు జూచితిన్

అని తాను వెనుదిరిగి చూచినప్పటి భావమిది.

## 8. రసికజన మనోభిరామము : *

ఇది మిక్కిలి మనోహరమైన ఆరాశ్వాసములు గల రసవత్తర ప్రబంధము. ఇందలి గద్య పద్యాల సంఖ్య 1011. ఈ కథకు మూలము బ్రహ్మ పురాణము అని స్వయముగ కవియే చెప్పెను. (రసిక-పంచ ఆ-207) గోదావరి ఖండము, వృద్ధసంగమ తీర్థవర్ణనము అనే మూలములో 36 అధ్యాయము లోనిది.

కథ: కల్యాణ పురమును అర్చిష్మంతుడను రాజు పాలించుచుండెను. ఇతనికి ఋతుధ్వజుడను నామాంతరము కూడ గలదు. ఇతని భార్య సుశ్యామ

---

* రసికజనమనోభిరామము - కూచిమంచి తిమ్మన.

వీరికొక కూతురు గలదు. ఆమెనొక గుహలో వదిలి, నీచెంతకేపురుషుడు ప్రథముడుగా వచ్చునో అతడే మగడని చెప్పి తల్లిదండ్రులు గంధర్వ లోకము చేరిరి.

ఆ మాట ప్రకారమే సుశ్యామ పుత్రిక గుహలో కొన్ని వేల యేండ్లు తపస్సు గావించెను. చివరకు గౌతముడను విప్రుడు ఆ గుహకు చేరెను. తన తల్లి వరము ప్రకారమే కాని అతడు వయఃపరిమాణము చాల దనెను. వాణి, వైద్యాగరుల ప్రార్థించి తగిన రూపము గావించుకొనెను. కాని వృద్ధాంగన యగుటచే లోకమున జనులు జూసి హేళన చేయసాగిరి. వారికి అగస్త్యు డొక ఉపాయము చెప్పెను. గౌతమీ, గంగను దర్శించి రమ్మనగా వార ట్లే గావించిరి. ఆ జల స్నానమాహాత్మ్యము వలన యిద్దరును సమవయస్కులై కాలమును సుఖమయము గావించుకొనిరి.

## 9. శ్రీ సర్పపుర మాహాత్మ్యము : *

ఈ క్షేత్ర మాహాత్మ్యమునందు 386 గద్య పద్యములుగలవు. కవి దీనిని శ్రీ భావనారాయణస్వామి కంకిత మిచ్చెను. ఇందులో మూడాశ్వాసములు గలవు.

ప్రాచీన కాలమునుండి సవతిపోరు సరేసరి. అట్టివారిలో భారత కథ ద్వారా కన్పించె కద్రువ నాగమాత. ఈమెచే శపింపబడిన అనంతుడను కొడుకు త్రిమూర్తికై తపమాచరించి నిత్యము శ్రీహరికి శయ్యయగునట్లు వరము పొందెను. ఇతడు తపమాచరించినది అనంత సరస్సుగా ప్రసిద్ధి గాంచినది. దీనినే యిపుడు సర్పపుర (వర) మందురు. నారదుని మోక్షము గావించుటకై శ్రీహరి యిచట వెలిసెను.

కథ : బ్రహ్మదేవుడు నిండుసభలో కొలువుండగ నారదుడు నేనొక్కడినే విష్ణుమాయకు లొంగనని గర్వించెను. అంతట బ్రహ్మకు కోపమువచ్చి, నీవు గర్విష్ఠివి, విష్ణుమాయకు లోనగుమనియు, భూలోకమున స్త్రీవిగమ్మని శపించెను.

---

* శ్రీ సర్పపుర మాహాత్మ్యము - కూచిమంచి తిమ్మన.

అంతట నారదుడు తండ్రియగు బ్రహ్మను బ్రతిమాలి ప్రాధేయపడగ, కరుణించిన బ్రహ్మ కొడుకుల వదసి ముక్తికల్గి నిజలోకమునకు రమ్మని ప్రతిఫలము ప్రసాదించెను. నారదుడు శాపము ప్రకారము భూలోకమున సంచారము చేయుచు సాయంత్రము సంధ్యావందనము గావించుటకు నీటికొరకు వెదకసాగెను

ఇట్టి సమయంబున విష్ణుమాయచే నొక కొలను సృష్టింపబడెను. ఇతడచటి కేగెను. తన చేతిలో మహతి (వీణను) ని తీరమునబెట్టి సరస్సులో దిగి మునిగెను. అంత నతడు స్త్రీ రూపంబై సుదతిగా పేరుగాంచెను. ఈ రీతిగా నా నారదుడు విష్ణుమాయకు లోనయ్యెను.

ఇట్లయ్యె నతడు అడవిలో ఒంటరిగా తిరుగాడుచుండగ పీఠాపుర మహారాజు నికుండుడను వాడు వేటకై వచ్చియుండి, సుదతిని చూచి మోహించెను. వివాహము జరిగెను. ఈ రాజుకు రిపుంజయు డనువాడు శత్రువు. వీరికి ఘోర యుద్ధము జరిగెను. రణములో నికుండుడు (భర్త) శత్రువుల చేతిలో హతుడయ్యెను. సుదతికి జన్మించిన శతపుత్రులు కూడ హతులైరి. సుదతి కెవ్వరు లేనందున దుఃఖించుచుండగ ఆకలి గల్గెను.

హరి మాయ చూపుటకై మహావృక్షమై ఫలములు సృజించెను. ఫలము లాసించిన సుదతి అందుకొనజాలకపోయి విలపించుచుండెను. అంత విప్ర రూపమున విష్ణువచ్చి కొలనులో స్నానమాచరించిన ఫలము దక్కునని చెప్పగా, సుదతి నట్లే గావించినది. కొలనుమునిగినంతనే తిరిగి నారదుడయ్యెను. అందువలన ఈ చెరువునకు "ముక్తి కాసారము"ని పేరు గల్గినది. దీనికి నారద గుండమని పేరు కూడ గలదు. ఇచటనే శ్రీహరి భావనారాయణ స్వామిగా వెలసెను. (ఈ కథకు మూలము బ్రహ్మకైవర్త పురాణమని తెలిపెను.)

## 10. శ్రీ శివలీలా విలాసము :

ఇది కుక్కుటేశ్వరస్వామి కంకిత మీయబడింది. ఇందలి పద్యముల సంఖ్య 862. ఇది శ్రీనాథ హరవిలాసమును బోలి యున్నది. ఈ ప్రబంధమును కవి 81 దినములలో రచించినట్లు చెప్పుకొన్నాడు. ఇది శృంగార రస ప్రధానమై, దశవిధ మన్మథావస్థలను వర్ణింపబడినవి. గంగాదేవితో సంభోగ యుద్ధమును, మన్మధునికి హరునకు యుద్ధమును కవి సమానముగా చిత్రించెను.

కథ : బ్రహ్మదేవుడు మొదట నీటిని సృష్టించెను. అందులో తన వీర్యమును విడువగా నది యండమై జగత్తును సృష్టించెను. అట్టి సమయమున మూషికాసురుడను రాక్షసుడు ఆ యండమునకు బిలము కల్గించెను. అందుండి నీరు ప్రవహిస్తూ ప్రపంచమును ముంచివేయుచుండెను. అపుడు కల్యాణప్రదుడగు శివుడు గంగను శిరమున బంధించెను. అయినను గంగాదేవి ఆగక ప్రవహించుచుండెను. అట్టి యెడ శ్రీహరి తన పాదాంగుష్టమున నొక్కిపెట్టెను. అయినను గంగాదేవి నన్ను ఆపేవారు లేరని గర్వించెను. అప్పుడు శివుడు కోపించి భూలోకమున మత్స్యకన్యవగుమని శపించెను. ఆమె ప్రాయశ్చిత్తము కోరగా పరమేశ్వరుడు తాను వివాహమాడుదునని చెప్పెను.

తరువాత గంగాదేవి భూలోకమున జాలరియగు శంఖదేవునకు బిడ్డయై జన్మించెను. జంగమ వేషధారి శివుడు వివాహమాడెను.

ఈ విషయము తెలిసిన నారదుడు పార్వతీదేవికి విషయము విన్నవించగా శివుడా విషయము గ్రహించినవాడై భయపడి గంగను జడలో దాచెను. పార్వతి పైవిషయమును అడిగినచో పరమేశ్వరుడు తనకేమి తెలియదని సమాధానమిచ్చెను.

కాలవశమున శివ పార్వతులు పాచికలాడుచుండిరి. శివుడు ఓటమి చవిచూచెను. పార్వతి పకపక నవ్వెను. గంగాదేవి తొంగిచూచెను. పార్వతి

శివుని నిందించెను. గంగ క్రిందికిదూకి సపత్నుల (వసతుల) సంవాదము సాగించెను. శివుడు ఇద్దరిని ఓదార్చి, గంగకు ఉత్తమాంగమును పార్వతికి అర్థాంగమును ప్రసాదించి స్థానమును కల్పించెను.

## 11. శ్రీ భర్గ శతకము :

ఇది అధిక్షేపముగా ప్రసిద్ధి గాంచినది. భక్తి ప్రధానమైనది. భగవన్నామ సంకీర్తన, పరమేశ్వరలీల, భక్తి ప్రశంస, ఆత్మనివేదము కలిగి నీతి అధిక్షేపములున్నవి. కపట భక్తి, నిశ్చలభక్తి, విగ్రహారాధన, తీర్థక్షేత్ర సందర్శనము, గృహస్థ ధర్మములు, మూర్ఖుల ప్రవృత్తి, దుష్టరాజుల ప్రవర్తన, లోభిజన నిందలు గలవు. పరధనము, పరస్త్రీ, ప్రజాపీడనము, కవి పండిత బుధజన తిరస్కారము వలదని భగవంతుని ప్రార్థించినాడు. అల్పుల, అవివేకుల, దుష్టుల తూలనాడెను. ఈ యుగకవులు కాయముచే మత్తిల్లిరని నిశితముగా విమర్శించెను.

పరాక్రమ శీలురకే మహాప్రబంధాలొప్పును. కాని అల్పులకు కాదనియు, బృహత్కాయము కరికే కాని ఊరపందులకు కాదుకదా! యని అక్షేపించెను. "ఆకుల్మెక్కెడె మేక" అని కొందరిని నిందించెను. మహాకవులు దైన్యముచే రాజుల నాశ్రయించరాదని ఉపదేశించెను. షట్కర్మల వదలి జిట్టెడు పొట్టకై దుష్కపటుల పొగడుటయు, నాశ్రయించుటయు తుచ్ఛమని బోధించెను. కవులు రాజులకు కృతులొసగరాదని చెప్పెను. కలియుగమున నానాజాతుల వారు కావ్యమున కుద్యమించెదరనియు, కుకవుల కవితలు కాసులకులోనై గంపెడయ్యెననియు, నాటి కవుల దుస్థితిని తిమ్మన దూషించెను.

లోభగుణము, దుర్గుణముగల వ్యక్తుల నాశ్రయించుట, రాజులు ధనాధిపతులు వీరి నాదరింపక పోవుటచే వారిని విమర్శించెను. గుణహీనుల గృహస్థ ధర్మములు విడిచి పరదేశాగమనము చేసిన వారి కొంపలేటివని తిమ్మన నిందించెను.

దుష్టజనుల విషయములో తిమ్మన ఇట్లు అంటాడు : గాజుఁపూసలు రత్నాలగునా? నల్లకాకులు హంసలగునా? జోరీగలు తేనెటీగలగునా? ఏనుగు సింహమగునా?[1] సర్వదిక్కులకు రాజగునా? మహాలోభి దుర్జనుడు నీతిమంతు డగునా? ఇలలో నిట్టివి దుర్లభము అని చెప్పెను. బ్రాహ్మణుల యెడ రాజులును ప్రజలును తూలనాడిన విధమును వో! వో! బాపడ...... భర్గ పార్వతీవల్లభా.[2] యజమానికి అపకారము కోరే సేవకుడు, కలహశీలియగు బంధువు, కొమ్ములతో కుమ్మే ఎద్దు, ఎదురాడు సతి, చెడిన సుతుడు మొదలైనవి గృహస్థుని జీవితమునకు దుర్భరమని చెప్పెను.

## 12. చిరవిభవ శతకము :

ఈ శతకము నాకు లభించలేదు. క్రీ. శ. 1923లో శ్రీ చెలికాని లచ్చా రావుగారి చేత ప్రకటింపబడినట్లు తెలియుచున్నది.[3] చంపకమాల పద్యములతో కూడిన 101 పద్యములున్నట్లును, చిరవిభవా? భవా విజిత చిత్త భవా! అను మకుటము గలదని తెలియుచున్నది.

## 13. కుక్కుటేశ్వర శతకము :

ఈ శతకములో 92 పద్యములు గలవు. ఇందలి మకుటము భూసుత విలాస! పీఠికాపుర నివాస! కుముదహిత కోటి సంకాశ కుక్కుటేశ! అని యున్నది.

పైన పేర్కొనిన కృతులన్నియు శ్రీ కుక్కుటేశ్వర స్వామికే అంకిత మివ్వబడినవి. ఒక సర్పపుర మాహాత్మ్యము మాత్రము భావనారాయణస్వామికి అంకిత మివ్వబడినది. రసికజన మనోభిరామము అష్టాదశ వర్ణనలు గల్గి ప్రబంధ ఫక్కిన నడిచినది. ఇది మిక్కిలి మనోహరమైన శృంగార ప్రబంధము. స్త్రీ - పురుష సౌష్ఠవ వర్ణనలు చాల చక్కగా గలవు. సింహాచల క్షేత్ర మాహాత్మ్యమయ్యు ఇదియు కొంత ప్రబంధ రీతిగా నడిచినది. తిమ్మకవి హరిహరనాథ తత్త్వమును పాటించినాడు. శతకములలో లోకము పోకడ, దుష్ట

1. భ. శ. 76.
2. భ. శ. 94.
3. పిఠాపుర సంస్థానము- కవి పండిత పోషణ కమలా అనార్కలి.

రాజుల ప్రవర్తన, పాలన, పోషణ, ప్రజల కష్టములు, ఇహపర సుఖధర్మములు, ఇంతుల బాధల వివరములను, వేశ్యల జీవిత విశేషాలు కన్పడును.

ఇతడు పోతనవలెనే కృతులను "నృపుల కొసగిన" నపవర్గంబిడగ గలదొ అని భావించినాడు. కవి సార్వభౌముడు తిమ్మనకు ధనాపేక్షలేదు కావున నర స్తుతి చేయక అంకిత మివ్వక కుక్కుటేశ్వరునకే అంకిత మిచ్చుట వలన దైవ పరజ్ఞుడుగా భావించవలెను.

కం॥ నృపులకు కావ్యంబొసగిన
నపవర్గంబిడగ గలదొ యటుగాకున్నన్
ద్విపతురగ భూషణంబుల
తపనీయాదికము(ల) చేత దనుపంగలరో

(సిం. మా. 1-54)

ఈ కవి కాలమును క్షీణయుగ మనవచ్చును. ప్రబంధయుగము నశించినది. దక్షిణాంధ్ర దేశమున రాజ్యము లంతరించినవి. రాజులు గతించిరి. చితికిన దేశము ఛిన్నాభిన్నమైన చిల్లర ప్రభువుల పాలయ్యెను. స్వల్పాదాయ జనులు మిగిలిరి. రాజ్యపాలన సమర్థత లోపించెను. జమీందారి కాలమున కళాసంపద జాతికళలు క్షీణించినవి. పరాధీన భావ ప్రజలు దాస్య ప్రవృత్తికి లోనైరి. తేజో వంతము, శ్రేయోదాయకమగు కవిత్వము లడుగంటినవి. క్షుద్రభావములు రేకెత్తినవి. ఆ కవులు స్వతంత్రతత కోల్పోయినారు. పూర్వకృత కావ్యములు అనుకరింపబడినవి పిల్లవసుచరిత్రలు బయలుదేరినవి. విశ్వ ప్రబంధములు బయల్పడినను ఇతి వృత్త, నూతన భావ, సన్నివేశ కల్పన సౌంద్యములు శూన్యమయ్యెను. పచ్చి శృంగారము, పూర్వగ్రంథ చౌర్యము, భావదారిద్ర్యము, దాస్యములు కనబడెను.

ధనికులు వాణిని వాణిజ్యమునకు అమ్మకొనసాగిరి. విలాస కావ్యము లకు ప్రసక్తిలేదు. ఈ కాలము అంధకారయుగము - క్షీణయుగము కంటే సంధి యుగమనుట బాగుండును. Age of Transition అనికూడ అందురు. విమర్శనాగ్రేసరులకు అవకాశము కల్గినది. తిమ్మకవి కవిత్వరచన చిత్రరచన, శ్లేషపద్యాలు, బహుగ్రంథకర్త అయిన తిమ్మన తుచ్ఛ భోగములకై కబ్బము లిడక, ఆత్మగౌరవ భావంబులో కుక్కుటేశ్వరునకే అంకిత మిచ్చెను.

1. శ్రీ సిం. మా - 1 ఆ - 54 ప.

# తృతీయ ప్రకరణము

## శ్రీ సింహాచల క్షేత్ర మహిమ-ఇతివృత్తము

ఈ ప్రకరణమున సింహాచలక్షేత్ర మాహాత్మ్యము అనుకావ్యమునందలి ఇతివృత్తమును పరిశీలించవలసి యున్నది. ఈ కావ్యము దాని పేరుకు దగినట్లున్నది. కాని సింహాచల క్షేత్రమునకు సంబంధించిన కథలను కలిగియున్నది. ఈ కవి ఒక కథను మాత్రమే మొదటి నుండి చివరివరకు రచింపవలెనని ఉద్దేశించిన వాడు కాదు. అందుచేత ఈ కథలన్నియు క్షేత్రమును కేంద్ర స్థానమును కావించుకొని రచింపబడినట్టిది.

సింహాచల మాహాత్మ్యము క్షేత్ర మాహాత్మ్యమే అయినప్పటికి కథా సంవిధానము మాత్రము పురాణ కథా పద్ధతిలోనే యున్నది. ఈ పద్ధతి ఇట్టి కావ్యములకు సముచితమైనది కూడ. ఎందుచేత ననగా భీమ ఖండము, కాశీ ఖండము మొదలగు ప్రాచీన కావ్యములలో పౌరాణిక పద్ధతియే అనుసరింపబడినది. ఈ కవి కూడ ఇట్టి పద్ధతినే అనుసరించి యున్నాడనుట సమంజసముగా నున్నది. సింహాచల మాహాత్మ్యములో జైమిని యను మహర్షి తన శిష్యులైన మునులకు ఈ కథలను వర్ణించి చెప్పినట్లుగా నున్నది.

మహర్షులు తమ అనుచరులకు కథలను చెప్పుట పౌరాణిక పద్ధతియే కదా! ఈ కావ్యము నందలి కథా విశేషణములు ఇట్లు ప్రారంభమైనవి:

ఈ కావ్యమునకు నృసింహ స్వరూపుడైన విష్ణుమూర్తి అధినాయకుడు. అందుచేత మొదట నృసింహావతారమే చెప్పబడినది. ఇది నిజమునకు క్షేత్ర మాహాత్మ్య మనదగినదే. శ్రీ సింహాద్రి నారసింహునిగూర్చి, వారి నివాస యోగ్యతల వివరములను గూర్చి, ఆ దేవుని సందర్శించినను, కథ వినినను,

చెప్పినను, చదివినను తెలిసికొన్నవారికి మోక్షము లభించునని చెప్పే ఈ కథ నిజముగా క్షేత్ర మాహాత్మ్యమనదగినది.

ఇందలి వర్ణనలు :- పుర, శైల, ఋతు, వన, యుద్ధ, దౌహృద వర్ణన చంద్రోదయ, సూర్యోదయ, కన్యాంగ సౌందర్య వర్ణన, గజ, అశ్వ, దేవతా వర్ణన, స్నాన, చందనాది పూజా విధానముల వర్ణనలు మిక్కిలి మనోహర ముగా - కన్నుల ముందున్నట్లుగా తోచును.

ఇట్టి కథ స్కాంధ పురాణాంతర్గతమైనదని తిమ్మ కవియే చెప్పెను. భూమిపై వెలసిన నాలుగువందల స్థానములు గలవు. అందులో ముఖ్యమైనవి నాలుగు. అవి :

1. అహోబిలము 2. కృతశౌచము 3. హరింపావనము 4. సింహాచలము అనునవి. ఇవిగాకను మరెన్నోగలవని కవి చెప్పెను. వెలసినవి, వెలువనున్నవి ఎన్నోగలవని[1] చూపెను.

రాక్షసుని చంపి ప్రహ్లాదుని రక్షించుటకై "వైకుంఠము నుండి శాంత మూర్తిగైకొని సింహ భూధరమునిలె"[2]నని జైమిని మునీంద్రుడు తన శిష్యులతో కథ చెప్పనారంభించెను.

"అహోబిలంబున కంబమున బుట్టి దైత్యుని జంపి, కృత శౌచమున పవిత్రిత మీర రక్తంబు కడుగుకొని, హరింపావనమున ఘోర కల్మషముల నాశన మొనర్చి, శ్రీ సింహాచలమున శ్రీ యుక్తుడై నధివసించె" ను. ఇట్టి స్వామి కథను విన్నవారును, స్వామిని పూజించిన వారును పుణ్యలోక ప్రాప్తిచెంది,

1. శ్రీ సిం. మా. 1-71.
2. శ్రీ సిం. మా. 1-79

విష్ణులోకమును పొందుదురు. సింహాచలమున నివసించు జనులు పుణ్యాత్ములు. వారు ధన్యులు. వారిని చూచిన మాత్రమున ఘోర కల్మషములు నశించును. ఇది చిత్రము సుమా! అని చెప్పెను[2]. ఇచట నివసించు జనులతో బంధుత్వము కలిగియున్నను "ఈ గిరి దిక్కుజూచి సుస్థిరమతి మ్రొక్కువాడు పరసీమ నుండియు జేరు ముక్తికిన్[3]". ఇక దేహాలయ విశేషములు గానసగును.

కం॥ పశ్చిమ ముఖమగు నగ్గిరి
బశ్చిమ వాహినిని మునిగి భక్తి దలిర్పన్
బశ్చిమ ముఖు నరహరి గని
పశ్చిమ జన్మాఘములను బాయుదురు జనుల్. (1-100)

అని చెప్పటచే విశిష్ట గంగధారలో స్నానం చేసిన "దురిత క్షయంబు పస్మార కుష్ట రాజయక్ష్మాది రుఙ్నివారణము భువిని[4]" అని నీటి మహిమను పొగడెను. ఇచటి గంగా స్నానము చేసినచో మఱ్ఱిచెట్టు పాదమున విష్ణుపదమున్న తీరున ధన్యత పొందుదురు. సూర్యుడు కన్యాగతుడగుట, మంత్ర పూతమైన పక్షశ్రాద్ధముచేత పితరులు ఏ తీరుగా తృప్తి పొందగలరో అట్లే సింహాచలంబున శ్రాద్ధమిడిన పితరు నెల్లరు తృప్తి పొందుదురని తిమ్మకవి ఘంటాపథముగా చెప్పెను.

ప్రహ్లాదుని బ్రోవ నరసింహుడై అవతరించి పరమేష్టిచేత, శంకరునిచేత, అమరవరునిచేత పూజింపబడెను. కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర వాసవాదుల చేత, నారదునిచేతను, లోకోత్తర, లోకోత్తముల చేతను, సనకాదులచేత, చక్రవర్తుల చేతను అర్చనలు గొనుచు సకల కామ్యార్థముల నిచ్చి సాకుచుండెను. భక్త వరదుడు సింహాద్రి పాలకుడై సింహాచలమున నివసించెను.

1. శ్రీ సిం. మా. 1-108.
2. శ్రీ సిం. మా. 1-97.
3. శ్రీ సిం. మా. 1-95-100.
4. శ్రీ సిం. మా. 1-105.

ఇట్లు కొంత కాలము గడిచిన పిదప పురూరవ చక్రవర్తిచేత ప్రతినెల ఆరాధింపబడు చుండెను. గంధయాత్ర ఉపచారములచేత కొలువబడుచుండెను. కలియుగమున భక్తి గల్గని మానవులు అపవర్గ మార్గమును పొందుదురు. పృథ్వి నెవడు సింహాచలమును దర్శింపడో అట్టివాడు దేవుని చేతను వంచితుడు[1] సింహాచలమును దర్శించినవాడు సంసార బంధములు బాసి విష్ణు పదము పొందును. అరిషడ్వర్గములు విడిచి శమదమ గుణ ప్రసిద్ధుడై యుండును,

కావున మానవుడు ముక్తి మార్గము కోరినవాడై పావన మతితో[2] నుండి నిత్యము దర్శింపవలెను. ఈ సింహగిరికేది సాటి రాదనియు కవి చెప్పెను. ఇచటి జనులు విలాసవంతులై నిత్యము క్రీడలొనర్చుచు నుల్లసిల్లిరి. ఏ చింత లేకయు జనులు హరి చరిత్రము గానము చేయుచుండిరి. బ్రహ్మాదులు అహర్నిశంబులు స్తుతింతురు. అచ్చరలు నృత్యము చేయుదురు. షట్కర్మ రతులైన జనులు నిత్యము నృసింహుని పూజింతురు. అప్సరసలు నాట్యము చేయగా మర్త్యకోటి మచ్చికకై పుష్పబాణుడు ఎదురుచూడసాగెను. మునులు కందమూలాది ఫలములు తినసాగిరి. సిద్ధయోగులై పరంజ్యోతులై నృసింహుని ధ్యానింపసాగిరి. ఔషధములు మాణిక్య దీపములవలె వెలుగొందుచుండెను.

ఆ సింహగిరియందు శుకశారీకాకీర కోకిలములు మధుర గేయములు పాడు చుండెను. తుమ్మెదలు మకరందమును గ్రోలి గానములు చేయుచుండెను. మేఘముల ధ్వని విని నెమళ్ళు పురులు విప్పి నాట్యము చేయసాగెను. శీతల వాయువులచేత పుష్పాళ్ళు సొంపారగ మంద మారుతములు మానవ శరీరములకు విలాసముగానుండ ఎండలందును నీటి బిందువు లేర్పడెను.

---

1. శ్రీ సిం. మా. 1-117,
2. శ్రీ సిం. మా. 1-120

# శ్రీ సింహాచల స్థల విశిష్టత

జైమిని మునీంద్రుడు తన శిష్యులతో నిట్లనెను: నరుడు భూ ప్రదక్షిణము చేసిన పుణ్యము శ్రీ సింహాచల ప్రదక్షిణము చేసినచో గల్గును. ఇచ్చటి మహిమలు తెలుప నెవ్వరితరముగాదు అని చెప్పెను.[1] మరియు ఈ క్షేత్ర మాహాత్మ్యమునుగూర్చి జైమిని తన శిష్యులతో సింహాద్రిని మిక్కిలిగా పొగడెను. మృగములలో సింహమును, నరులలో బ్రాహ్మణుడును, సురులలో చతుర్ముఖుడును, భూసురులలో వ్యాసుడును, ధేనువులలో కామధేనువును, లోహములలో సువర్ణమును, వృక్షములలో కల్పవృక్షమును, గడ్డిపరకలలో దర్భయు, తీగలలో మాలతియు, నదులలో గంగానదియు, సరోవరములలో మానసమును, లోకములలో సత్యలోకమును, గ్రహములలో సూర్యుడును, తారలలో చంద్రుడును, సాంద్రములలో క్షీరమును, దిక్పతులలో ఇంద్రుడును, వసువులలో పావకుడును, యాగములలో అశ్వమేధమును, ఆశ్రమములలో యతియును, చతుర్విధ పురుషార్థములలో మోక్షమును, వ్రతములలో ఏకాదశియును, దీక్షలలో వైష్ణవమును, క్షేత్రములలో పురుషోత్తమును, విష్ణ్వవతారములలో నృసింహావతారమును మిక్కిలి గొప్పవి. అట్లే సర్వ గిరులలో సింహాగిరియు గొప్పది. నరహరికి సమానమగు దైవమును, సింహాద్రి సమాన క్షేత్రమును లోకమున లేవు. సింహాగిరి ధార గంగాధారవలె నొప్పిన తీర్థము ముల్లోకములలో లేవని చాటి చెప్పిన ఘనత తిమ్మ కవికి దక్కినది.

ఈ క్షేత్ర మాహాత్మ్యము వినినను, చదివినను, వినిపించినను జనుల దుఃఖము బాసి స్వర్గవాసము లభించగలదు. వైశాఖమాస శుక్ల పక్షమున చతుర్దశినాడు ఉపవాసముచేత నృసింహుని పూజించినవారు ముక్తి పొందుదురు. ఏకాదశి నమావాస్య పౌర్ణిమ సంక్రమణములలో నీ మాహాత్మ్యమును వినువారు ఘోర పాపములు బాయుదురు. ఈ కథను జైమిని శిష్యులకు చెప్పగా వినుచు

1. శ్రీ సిం. మా. 1-37.

అవతలి కథ చెప్పుమనగా మునీంద్రుడు మొదట వ్యాసమునీంద్రుని చేత విని యున్న కథ చెప్పెద వినుడు అని చెప్పెను.

## జైమిని మహర్షి హిరణ్యకశిపుని చరిత్ర చెప్పుట

కృతయుగమున హిరణ్యకశిపుడు అను రాక్షసుడు అతని సోదరుడు హిరణ్యాక్షుడు మిక్కిలి పరాక్రమ వంతులైరి. పూర్వము వీరు విష్ణుదేవుని సన్నిధిలోని జయ విజయులను ప్రతీహారులు. అట్టియెడ శ్రీహరిని జూడ సనకాది మునీంద్రులు వచ్చిరి. వారిని జయ వియయులు ఆపిరి.

అప్పుడా మునీంద్రులు మిక్కిలి కోపించిరి. అట్టి సమయముననే విష్ణు మూర్తి గరుడ వాహనుడై జనుల జూడ బయలుదేరి మొగసాల ముందర నిలిచిన మునీంద్రుల జూచెను. వారిని ఆదరించి, మీరాక ఏమిటని అడుగ వారు కరయుగ్మములు ముకుళించి మ్రొక్కిరి.

అప్పుడు మునీశ్వరులు ఇట్లు పలికిరి—

ఓ పరమేశ్వరా! నీనాభినుండి నలువ జన్మించెను. అతని వలన యావత్ప్రపంచము జన్మించెను. అందులో సత్యరూపమున లోకముల కాపాడెను. నీవు లయకారుడవు నీవె. ఇతరులు కానేరరు సూర్య చంద్రాదులు నీ రెండు కళ్ళు. దిక్కులే చెవులు. భూమి స్థలము. పాదము వదనవహ్నినులే. వదను డింద్రుడు. భుజంబునవి. కుక్షి జనన మరణాదులైన జనులు నీదరికి చేరగలరు అని విన్న వించిరి.

## జయ విజయులు శాపమును పొందుట

విష్ణుమూర్తి జయ విజయుల నిట్లు శపించెను: మీరీ లోకములం నుండ దగదు. ముల్లోకములు దాటి అసుర యోనిని జన్మించి, మూడు జన్మల పైన నాదరి చేరగలరు[1] అని శపించెను. అంతలో వారు మర్త్యలోకమున కశ్యపు నదితులకు నందనులై హిరణ్యకశిపు, హిరణ్యాక్షులైరి.[2] వీరు మిక్కిలి గర్వాంధ

---

1. శ్రీ సిం. మా. 1-158-53. 2. శ్రీ సిం. మా. 1-157.

కారులై గదబూని నేం పొడి చేసిరి. దిగ్గజముల ఓడించిరి. వీరి నెదిరింప దేవ దానవులకు కూడ శక్యము గాదు. కావున ఇంద్రాది దేవతలుకూడ లోకములు విడచిరి. దేవతలందరు కలిసి నలువకడ కేగిరి. బ్రహ్మ వారి మొరవిని ధ్యానము చేసి అంగుళ ప్రాయమైన పురుషుడుగా ఉద్భవించి, బిలమున వెడలెను. ధ్యానించుచున్న యోగి జనులముందు శ్రీహరి సూకర రూపము దాల్చెను.వామన మూర్తి పాదముల చతుర్వేదములును, అంగ సంఘలందు స్మృతి పురాణము లును, ఇట్లు వివిధ భాగములందు వివిధ శాఖలు వహించిన శ్రీహరిని గూర్చి ఇట్లనిరి.

మునులచేత నుతింపబడువాడవు, వేద కర్తవు, కల్పుదవు, శిక్షామయు డవు, పంచాంగ కర్తవు, సప్త దశాక్షరములు నీవె ఫల ప్రదాతవు నీవె. పురో డాశహవిస్సులును నీవే.

హిరణ్యాక్షునిచే జనులు పీడింపబడుచున్నారు. వానిని ద్రుంచి జనకోటి నుద్ధరింపుము. మంధరము క్రింద కమఠముపై అమృతమును పంచినవాడవు అని పొగడగా విష్ణుమూర్తి వింధ్యవలె పెరిగిపోయెను. మేఘమువలె ఘర్జించెను. భూమిని నీలద్రొక్కి బలిని ద్రొక్కిన రీతిగా నిశాచరుని ద్రుంచుము అనగా శ్రీహరి యట్లే గావించి, గత భయుండైన హిరణ్యాక్షుడు మంధరగిరివలె కదలెను.

రాక్షసుడు గదయెత్తి రాగ హరి వాని బొమ్ముచీల్చి కొండవలె పడవేసెను. వాడు చనిపోయెను. హరి పుడమిని వజ్రము కొమ్ముతో కాచెను. సురలు సుధలు కురిపించిరి.

## జైమిని శిష్యులతో తరువాతి కథ చెప్పుట

హిరణ్యాక్షుడు మరణించిన పిమ్మట, హిరణ్యకశిపుడును పుత్రశోకముతో దితి కోడలును దుఃఖములో మునిగియుండిరి. దైత్యులు భిన్నహృదయులై యుండిరి. హిరణ్యకశిపుడు ఘోర తపమొనరించెను. తపోగ్నిజ్వాలలు నలు మూలల వ్యాపించెను. అడవిలో మల్లెలు మహావృక్షములు చిగుళ్ళు దొడిగెను. వసంతఋతు వేతెంచెను.

మకరాంకుని మూకలు పూదోటలలో దిగెను. రాక్షసులు సంచరించిరి. శుకపికాదులు తేనెటీగలు వనమున నిండియుండెను. వాటి నాదములు వేదమంత్రములవలె తోచెను. మంచి మల్లెలు అక్షంతలువలె నుండెను. తేటిపాటలు కిన్నెర గానములుగా నుండెను. పుప్పొడులు గంధముల రాల్చెను. మల్లె మొగ్గలు తలంబ్రాలుగా మారెను. లేగొమ్మలు తోరణముగను. పండుటాకులు వేదికలుగను, గురివింద పొదలు పందిరిలుగను తోచెను. పుష్పతరువుల ఆకులు పళ్లెములుగను, గాలిచే కదలిన వృక్షముల ధ్వని వాద్యములుగను, మధుపానముల కాంక్ష చండాలురకు వచ్చెను. పల్లవాళికి రాగంబుగను, భూజనులకెల్ల సుమనః ప్రవృత్తిగను, వసంతునికి మన్మథుడు తోడురాగ వనములో హిరణ్యకశిపుడు ఘోర తపమాచరింప సాగెను. ఇట్టి వర్ణన సింహాద్రిని పోలియున్నది.

ఇంద్రుడు అప్సరసలతో నిట్లనెను: ఓ కన్యకలారా! మీరు తక్షణమే చేరి మచ్చికతో కోరికలు దీర్చి తపోభంగము గావించుడని ఆదేశించెను.

## హిరణ్యకశిపుని తపోభంగముగావించుటకై ఇంద్రుడు అప్సరసలను పంపుట

హిరణ్య కశిపుడు పది వేల సంవత్సరములు ఘోర తపమొనర్చెను. స్నేహముతో తిలోత్తమయు, కళలతో చంద్రరేఖయు,లీలతో రంభయు, ఎరుపు రంగుతో హేమయు, అసమాస్త్ర విద్యల వరూధినియు, చూపుల్లో హరిణియు, కాంతి కాంతుంతో రత్నమంజరియు, చెదరక నిల్చుటలో చిత్రరేఖయు ఒక రేమిటి? పేరెన్నికగన్న వారందరును హిరణ్యకశిపుని ఎదుట పెక్కు గతుల నటింప సాగిరి. ఇంద్రుడు పంపిన వారంచరు మరియు వసంత మన్మథులను కూడ వెళ్ళిరమ్మని చెప్పిరి

ఏక పదాంగుష్టమాన నిల్చి తపము చేయుచున్న హిరణ్య కశిపుని గూర్చి దేవతలు బ్రహ్మకు విన్నవించిరి. దుష్ట రాక్షసునికి వరములివ్వరాదని చెప్పిరి. అప్పుడు బ్రహ్మ దైత్యుని వద్దకేగి ఇంత ఘోర తపమొనరించిన వారెవ్వరు.

లేరు, ఒక శివుడు తప్ప అని చెప్పి తన కమండలోదకము చల్లి వజ్ర కళేబర మును తాకగా హిరణ్య కశిపుడు నిండు జవ్వనుడై నిల్చి నమస్కరించెను.

హిరణ్యకశిపుని తపమునకు బ్రహ్మ మెచ్చి వరము కోరుకొమ్మని దిక్పాలకులు వినునట్లుగా బల్కెను.

## హిరణ్య కశిపుడు బ్రహ్మను వరములడుగుట

ఓ దేవా! తిరముగ నాకు వరమిచ్చెదవేని నీ సృష్టిలోన భూతతతుల చేత దొరకనట్లు చూడుము. దేవతల శస్త్ర - అస్త్రములకు, తరు శైలాదులకు, ధరణియందు అంబరమునందు పాతాళమునందును మరణము లేకుండునట్లు వరమిమ్ము. పుడమిలో నెవ్వరు నాతోడ పోరతరము గాకుండను, ఋషీశ్వరుల శాపము తగులకుండను వరమిమ్ము అని కోరుకొనెను. అట్టి విధంగా వర మివ్వనిచో నేను తిరిగి తపమాచరించెదనని పలికెను.

అపుడు బ్రహ్మ హిరణ్యకశిపునితో ఇట్లనెను: వినుము హిరణ్యకశిపా! అమరులకు ద్రోహము చేయరాదు సురభూమి కైవసము చగదు. సురవిరోధంబు వలన సతుంగలచుట వలదు. ఇట్లు గర్వించిన పురుషుడు ఎన్ని వరములున్నను సుఖింపలేడు సుమా! అని వరము లిచ్చి వెడలిపోయెను. నాటినుండి దేవతలు హిరణ్యకశిపు డెప్పుడు తమపై దాడికి రాగలడోయని భయపడుచుండిరి' బలవంతుడైన అసుర రాజు హేమవతి నగరమును అవలీలగా పాలించుచుండెను. హిరణ్యకశిపుకు కొన్నేళ్ళకు నిజముగనే అమరపురిపై దండెత్తెను.

ఇంద్రుడు శత సంఖ్యల దానవేశ్వరుల ద్రుంచి శమనుడు కాలదండము చేతబూని మితిలేని భయంకరాకారులను ద్రుంచెను. కుభేరుడు గదచేత ఘన బలాన్వితులైన దైత్యనాయకులను చంపెను. సముద్రుడు పాశమున దైత్యేయుల నొక్కటిగా తేల్చెను. కిన్నర, కింపురుష, గంధర్వాదులు సమరములో రాక్షసుల చీల్చిచెండాడిరి. ఈ విధంగా దేవతల ముందు రాక్షసులు నిలువలేకపోయిరి. ఇంద్రుడు హిరణ్యకశిపుని రథ చక్రములను ముక్కలు గావించెను. కోపముచే

నా రాక్షసుడు దేవతల నందర చిందరవందర గావించి ముల్లోకములనేలెను. యాగ భాగములను అపహరించెను. దేవతలు బ్రహ్మకు నివేదించగా నతడు తానిచ్చిన వరములు తాను తెగ టార్చుట న్యాయము గాదని వారితో విష్ణువు కడకేగి నివేదించెను.

నవరత్న కాంతిమయుడు హరియుండు చోటునకు విముక్త జన సంఘములు శోకముతో హరిమందిరము చేరబోయిరి. ఈ దేవతల చూచిన హరి ద్వారపాలకుడు సముఖుడు వీరిని (దేవతలను) చూచి ఆపెను[1]. యోగ నిద్రలో గల శ్రీహరిని లేపరాదని నివారించెను.

## బ్రహ్మాది దేవతలు తమ దర్శనార్థమై వచ్చిరని శ్రీహరికి సుముఖుడు (ప్రతీహారుడు) చెప్పుట :

శ్రీహరి దర్శనార్థులగు బ్రహ్మాది దేవతలను ఆపిన ప్రతీహారుడు అంతఃపురము నకుపోయి వార్త నివేదించెను[2]. దేవతలు వచ్చిన వార్త విన్న విష్ణుమూర్తి దిగ్గునలేచి పాదుకలు దొడిగి దేవతల కలువ వచ్చెను. వచ్చిన విషయము అడుగ వారు రక్కసుని సంగతి చెప్పిరి. చివరికి నీవద్ద ప్రతీహారుని చేతగూడ నివారింపబడితిమి. ఇక మీరే బ్రోచేవారు. అనగా మీరిక భీతివదలి వెళ్ళుడు. మిమ్ముల నెవ్వడు ఆపెనో వాడు ఆరాక్షసుని వధకు కారణభూతుడగును అని చెప్పి పంపెను.

## సుముఖుడు విష్ణు శాపము పొందుట

ఓ మూర్ఖుడా ! దేవతల నాపినట్టి నీవు హిరణ్య కశిపుని తనయుడవై జన్మించుము[3] అని శపించెను. ఇట్లు శపించగా సముఖుడు కరయుగ్మము

1. శ్రీ సిం. మా. 2-148
2. శ్రీ సిం. మా. 2-155
3. శ్రీ సిం. మా 2-175.

ముగించి ఇట్లు వేడుకొనెను ఓ పరమేశ్వరా! నీ దాసుడనైన నన్ను నింతగా దండింపదగునా? అని విన్నవించెను. మరియు వారందరు తమ తమ అధికారము లను వదలి ఒకేసారి వచ్చుట వలన ద్వార సీమన నిల్పితిని కాని దోషమున కాదు అని ప్రతీహారుడు (సుముఖుడు) విన్నవించెను. అంత విష్ణుమూర్తి కరు ణించినవాడై ఓ సుముఖా! నీవు అసుర యోనిన జన్మించినను సజ్జనుడవై నాకు ప్రియభక్తుడవైయుండుము. నిన్ను కాపాడెదను. 'శిష్టరక్షణము దుష్టజన శిక్షణము' ధర్మ స్థాపనము చేయుటకే జగమున విచిత్ర లీలలు కల్పించితిని కావున నెవడు నాలో నైక్యము కోరునో వాడే జ్ఞాని. భూత కోటి భేదముల నెవరు చూచునో వాడు ప్రియుడు కాడు. వినుము నాయెడ నేరము చేసిన సహించెదను కాని నా భక్తులయెడ ద్రోహము చేసినచో సహించువాడను కాను.[1] కావున సుముఖా తక్షణమే వెళ్ళుమని - చెప్పిన హరి కథను జైమిని తన శిష్యులతో చెప్పెను.

శ్రీ కైలాసవాస! సురధామా! రవి పితామహా! గౌరీనాధా! యని కీర్తిస్తూ జైమిని మునీంద్రుడు సుముఖుని (సురవిరోధి) కథ చెప్పనారంభించెను.

హిరణ్యకశిపుని భార్య గర్భము దాల్చెను. అసురుని అపకీర్తి పెరిగి నట్టుగానే భార్య గర్భమాసములు పెరుగుచుండెను. నవ మాసంబులు నిండిన పిదప కొడుకును గనెను.[2] పురోహితులు ప్రహ్లాదుడని నామకరణము చేసిరి.[3] బాలుడు హరిని కీర్తింప సాగెను. జగమున జనార్దనుడే తప్ప వేరు లేడని చెప్పెను. "భూతములయందు దన్నును పొసగ నఖిల భూతములు దనయందు నెప్పుడును గనుచు" అని కొలువ సాగెను. తర్వాత గురువులవద్ద ప్రహ్లాదుడు "ఓం నమశ్శివాయః" అనుమనగా "నమో నారాయణాయ" అని చదువసాగెను. మరియు వారితో ప్రహ్లాదుడాడిన మాటలు.

---

1. శ్రీ సిం. మా 2-195.
2. శ్రీ సిం. మా. 3-7.
3. శ్రీ సిం. మా. 3-12.

"జన్మాంతరమున విష్ణుచేత నాకు నే బుద్ధి నాటుకొన్నదో అదేగాని అన్యుడుపదేశము చేయలేదు. అనఘులార[1] అని చెప్పెను. పంచాక్షరీచేత ప్రపంచము బుట్టెను. చతుర్వేదములు నిలిచెను. నారాయణ జపముచేయు నరుడు నారాయణుడే అని పలుకగా ప్రహ్లాదునితో గురువులిట్లనిరి. ఇసుమంతవాడవు వస ద్రాగిన పిట్టవలె పలుకుచున్నావు విష్ణు స్మరణ చేసిన నీ తండ్రి దండింప గలడు.

తండ్రి తనయుని గజములచేత తొక్కించెను. పాములచే కరిపించెను. కాని ప్రహ్లాదుడు హరికీర్తన మానడయ్యెను. ఓ బాలకా! ఎన్నితీరుల చెప్పిన వినవైతివి తదుపరి ఏమికానున్నదో యని గురువులు వెడలిపోయిరి. తండ్రి కొడుకుతో ఇట్లు పల్కెను. కుమారా! నీ తండ్రియగు హేమనేత్రుని జంపిన శత్రువుని స్తుతించుట పనికిరాదు. అని పలుక ప్రహ్లాదుడు తండ్రితో నాయనా! "ఈ మిత్ర భేదములను చక్రికెప్పుడు గలుగవతడు సమస్త జగన్మయుండు[2]" అనెను. ఈ మాటలు విన్న తండ్రి తనయుని జంపింప దానవుల కాజ్ఞాపించెను. పర్వముపై నుండి పడవేసిరి. సముద్రములో పడవేసిరి. సముద్రుడు లేవనెత్తి కౌగలించు కొనెను.

ప్రహ్లాదుని బాధించుచున్న రాక్షసాధములు దోయగ అబ్ధిలోబడిన బాల కుమారుని రక్షించపోవుమన్నట్లు సూర్యుడు గ్రుంకెను. ప్రహ్లాదుడు శ్రీహరి నానా రూపములను స్తుతించెను. హరి దర్శనము లభించెను. రేపు నేను నీ "తండ్రిని ద్రుంతు నిక్కంబు" నీవు భీతినందవలదు[3]. నీ తండ్రి నన్ను చూపుమని నిన్ను ప్రశ్నించిన స్తంభమును చూపుము. నేను బుట్టెదను అని చెప్పి అంతర్హితుడయ్యెను. ఈ వర్ణన ప్రబంధరీతిలో సాగినది.

---

1. శ్రీ సిం. మా. 3-65.
2. శ్రీ సిం. మా. 3-189.
3. శ్రీ సిం. మా. 4-46

రాజమార్గమున పోవుచున్న దైత్యులు ప్రహ్లాదునిజూచి నీ తనయుడున్నా డని హిరణ్యకశిపునితో విన్నవించిరి. వారిని తోడ్కొని రమ్మని చెప్పగవారు ప్రహ్లాదుని తెచ్చిరి. కొడుకుని తండ్రి కౌగలించుకొని, పుత్రా! నేను ఏ కీడు చేసినను నీవే గెలిచితివి. కారణము నీయందు హరి నుండనోపు. కాని నాకు క్షోభ కలుగజేయకుమని కోరెను. కవి తండ్రి యెడలగల గౌరవ భావమును, తనయుని యెడల ప్రేమయును కల్గింపజేసెను. దీనివలన హరియందు పూర్వపు స్మృతి గల్గినట్లు కవి నిర్మించెను తండ్రి నీకు కొరగాని పని ఏమి చేసితివి చెప్పుము అని పలుక బిడ్డా! నిజముగా నీయందు హరియుండెనేని నేను కోరిన తీరున చూపింపుము అని కోపముతో పల్కెను[1]. నాయనా! హరి సర్వాంతర్యామి ఎచట జూచిన అచట గలడు అని పల్కెను.

అంతలో కోపోద్రిక్తుడైన హిరణ్యకశిపుడు రోషముతో ప్రహ్లాదుని కేశ ములుబట్టి ఈ స్తంభమున గలడా! చూపుమని గద్దించెను.[2] స్తంభమును గదచే కొట్టినంతనే వీరనృసింహ డుగ్రరూపముదాల్చి మెరుపువలె పెరిగి హిరణ్య కశిపుని చంపెను. దేవతలు పుష్పవర్షము కురిపించిరి. ముప్పదిరెండు రూపములు ధరించినవాడై దైత్యుని జంపెను. పిదప శాంతమూర్తియై "కృతశౌచమున హరింపావమునను సిద్ధసేవితమైనట్టి సింహశైలమున నహోబిలమున ప్రియమున నివసించె.[3] దేవతలు కోల్పోయిన వస్తు వాహనాదుల వారికిచ్చి ప్రహ్లాదునకు పట్టము పట్టెను. పరిణయము చేయగా ఇతనికి విరోచనుడను సుతుడుదయించెను.

మునీశ్వరాదులు ప్రహ్లాదుని శాసనము దాటరైరి. ఇతడు అనేక క్రతువులు చేసెను. అనేక హాయనములు (సంవత్సరములు) రాజ్యము చేసెను అని జైమిని తన శిష్యులతో ఈ కథ విన్నవించెను.

---

1. శ్రీ సిం మా. 4-93.
2. శ్రీ సిం. మా. 4-100.
3. శ్రీ సిం. మా. 4-160.

ప్రహ్లాదుడు ధర్మమార్గ ప్రచారుడై రాజ్య మేలుచుండెను. ఇట్లుండగా తన తనయుడుగా విరోచనునకు రాజ్యాభిషిక్తు గావించి, బంధు పురోహితాదులతో బహుదూర మేగి సింహాచలమును గాంచెను. అచట ప్రాకారాది గోపురములు జూచి, గుడిని దర్శించి, హరికి స్నానంబులు గావించి అష్టోత్తరనామావళి స్తోత్రముచేసి, పీతాంబరములు గట్టి, చందనము పూసి, కర్పూర దీపధూప నైవేద్యాదులు సమర్పించెను. స్వామి శిరమున చూడారత్నమునిడెను.[1]

ఇట్లు నానాభూషణాదులు ధరింపజేసి, బహుప్రకారంబుల ప్రార్థించి, స్తుతించి నిజగృహమున కేగెను. అవనియందు వెలసిన కల్పాంతాగ్ని విభుడవు నరసింహరూపమునందు సౌమ్యమూర్తి యెద్దియొ నొకటి ఎఱిగింపుము అని బ్రహ్మ హరిని గోరెను. అపుడు హరి బ్రహ్మతో "ఆ హిరణ్యకశిపుడి నణచి ప్రహ్లాదునిచేత పూజ గొనుచు సింహాచలమునందు శాంతమూర్తి నగుచు" లక్ష్మీ దేవి సహితుడనై వెలసితిననెను. చైత్ర శుద్ధ ఏకాదశినాడు ప్రహ్లాదుడుచే మహోత్సవము జరుపబడును. మీరు (దేవతలు) ఋషీశ్వరులు జాగుచేయక విధిగా పూజింపుడు. శ్రద్ధతో దర్శించువారు నా పదమునకు చేరుదురు.[2]

నీవు సింహాద్రి కేతెంచి అద్భుతమూర్తినైన నన్ను దర్శింపుము అనగా బ్రహ్మాది దేవతలు భూలోక మందలి సింహాద్రిని ప్రహ్లాదుని జూడ వచ్చిరి. పశ్చిమాది ద్వార శ్రీముఖాదులు గల దేవుని జూడ దివ్య విమానముల దిగి జూడ వచ్చిరి. వీరిని జూచిన ప్రహ్లాదుడు మూలదాగి యుండెను. అపుడు బ్రహ్మ, వత్సా! నీవు పరమాత్మునకు సంప్రీతుడవు. సికిక భద్రము గాక. నీ మూలమునసనే విష్ణు విచట నిలచెను కృతార్థుడవు. నీ తల్లి దండ్రులు ధన్యులు. నీ పరిచారికలు ధన్యులు అని పలికి పూజకై పూలు దెమ్మని ప్రహ్లాదుని బ్రహ్మ కోరెను. అతడట్లే గావించి పూజ చేసెను.

---

1. శ్రీ సిం. మా. 5-56.
2. శ్రీ సిం. మా. 5-57.

ఇతర దేవతలు నైవేద్యమిడిరి. భుజించిరి.[1] 'ప్రహ్లాదుడు దేవలోకమునకు హరి పార్శ్వచరుడై భక్తి పరుడై విరాజిల్లు చుండెను. ఇట్లుండగా కలియుగ మరుదెంచెను. జనులు హరిని ఆరాధింపక దుర్భిక్షముల చేతను క్షయ మొందిరి. అన్యులు సింహనగరమున కేగిరి. కొంతకాలం పిమ్మట చంద్రవంశ చక్రవర్తి పురూరవుడు రాజ్య మేలుచుండెను. హరి వల్మీకాచ్ఛాదితుడై యుండెను. శ్రావణ ద్వాదశి కలిసిన శుభదినమున బుధునకు పుత్రుడై జన్మించెను. ఇట్లుండగా నొక నాడు పురూరవ చక్రవర్తి దివ్యవిమాన మెక్కి ఊర్వశిని గాంచి మోహించెను. ఆమె వల్మీక మందలి నృసింహుని క్షీరోదకముచే అభిషేకము చేసి పూజింపుమని వేడుకొనగ చక్రవర్తి అట్లే గావించెను. పురూరవ చక్రవర్తి ఊర్వశి సహితుడై దేవుని వెదక సాగిరి. ఇట్లు సంచరించు చుండగా నానావిధ పుష్ప, ఫల, వృక్ష, లతావితానములు చూచిరి. అచటి నుండి దేవుని గానక గంగాధార గాంచి స్నానమాచరించిరి భైరవ, గోదావరి, చక్రధార, మాధవ ధారాదులు మునిగిరి. నారసింహుని పూజించి దినత్రయంబుగడిపి తృతీయ దినము నందు రేయి యలసి కన్మూయునంతలో హరిని స్వప్నమున గాంచిరి. మేల్కొని చూడ ప్రహ్లాదు డిట్లనెను.

వల్మీకమందలి దేవుని పంచామృతముచే కడిగి వస్త్ర మాల్యాదులు గట్టి లేపనము పూసి, ధూపదీపాది నైవేద్యాదులు పెట్టి, వందనము చేసి నిర్మల చిత్త వృత్తిలో పూజింపుము అని ప్రహ్లాదుడు చక్రవర్తికి చెప్పెను. అక్షయ తృతీయకు ఏట చందనుని దర్శించరనియు, అకాల చందన మొలుచువాని వంశము నిర్వంశ మగునని చెప్పెను. నన్ను జూడ చందన మొలిచిన తిరిగి స్నాన పూర్వకముగా నందవలెను అని చెప్పి దేవుడు అంతర్ధాన మొందెనని పురూరవుడు ప్రహ్లాదునితో చెప్పెను.

1. శ్రీ సిం. మా. 5-125.

నిద్రలేచి లోకేశ్వరుని చూడ ఊర్వశి పురూరవులు వల్మీకము దాటి వెళ్ళగ దివ్య విమానము కదలలేదు. అపుడు స్వప్న గోచరము మదిని దలచి, నానా దేశముల నుండి "క్షీర భార సహస్రముల్ చిత్రముగను సరగ దెప్పించి" మరునాటి సూర్యోదయమున క్షీరధారలచే వల్మీకము కడిగి చూడ స్వామి చరణములు కన్పడెను. ఇంతలో ఆకాశవాణిట్లు పలికెను.

చింత నొందకుము సార్వభౌమ! స్వామి చరణములివిగో క్షితిలో గాన నయ్యెను అని పురూరవునకు చెప్పగా నతడు సుగంధాది లేపనములు చేసి నృసింహుని దర్శించెను. ఇట్లు ప్రతి ఏడు వైశాఖ శుద్ధ తృతీయ నాడు దేవుని గాంచిన వారు పుణ్యులగుదురు. అని చెప్పెను. కామధేనువును దలిచి. గంధర్వులు పొగడిరి. ప్రహ్లాదాదులు స్తుతించిరి. ఘృతాచియు మేనకయు అచ్చరలు నాట్య మాడిరి.

శిల్పకారులచేత నా రాజు గుడి కట్టించెను. కామితార్థులకు స్వామి వరము లిచ్చెను. ఇట్లు నిర్వహించిన పురూరవుడు హరి దరికి చేరెను. ఉత్సవములను చూచిన వారు ఇహపర మోక్షములు గల్గి ధన్యులగుదురు. విష్ణు పదమును పొందుదురు నిక్కమిది.[1] అని ఫలశ్రుతి చెప్పబడినది. ఈ విధముగా నున్నందున నిది పురాణ ప్రశస్తి కూడ నొందినది.

శ్రీ సింహాచల క్షేత్రమాహాత్మ్యము సందలి కథ ధారావాహికముగా సాగదు. స్వామి మహిమల చెల్పు కథ లవాంతరముగ నుండును. ఇట్టి కథను జైమిని మహాముని తన శిష్యులకు ఈ కథను చెప్ప నారంభించెను. ఇందులో మొదట నృసింహావతార మహిమను, తదుపరి నృసింహుని స్థానములను చెప్పబడినవి. పృథ్విపై వెలసిన నాల్గు వందల స్థానములు గలవు. అందులో ప్రసిద్ధ క్షేత్రములు నాలుగు అవి: 1. అహోబిలము, 2. కృతశౌచము, 3. హరింపావము, 4. సింహాచలము అనునవి.

---

1. శ్రీ సిం మా. 5-168.

గీ॥ వినుడు గనరాక గిరులందు వనములందు
భుక్తి ముక్తి ప్రదమూర్తి పుడమి మీద
గలిగినవి గలుగుచున్నవి గలుగగలవి
తరచుగల వెన్న నరహరి స్థానకములు.[1]

అని పరమాత్ముని స్థానములిన్ని అన్ని గావని చెప్పనలవిగాని స్థానము అనేకములని చెప్పెను. దానవుని చంపి ప్రహ్లాదుని రక్షించుటకై "వైకుంఠము నుండి శాంతమూర్తి గైకొని సింహ భూధరము నిల్చె[2]" అని మునులతో జైమిని మునీంద్రుడు చెప్పసాగెను.

స్వామిని పూజించినవారికి పుణ్యములు కలిగి విష్ణులోకము పొందుదురని తెలియ జేయు పద్యములు.

చం॥ పొలుపుగ సింహశైలమున పుట్టిన మానవ కోటికెప్పుడున్,
గలుగదు తల్లి గర్భమున గ్రమ్మర బుట్టుటయే స్థలంబునన్,
బొలసిన పుణ్యమానసులు భూరివినిశ్చల భోగ లీలలన్,
వెలయుచు విష్ణులోకమున వేడుక నుందరనేక కాలముల్[3]

గీ॥ అనుదినంబును సింహాద్రియందు నుండు
జనులు జగమున ధన్యులు వినుడు వారి
గనుగొనిన మాత్రమున ఘోర కలుష సముద
యంబు నాశంబు నొందు చిత్రంబుగాను[4]

---

1. శ్రీ సిం. మా. 1-71.
2. శ్రీ సిం. మా. 1-79.
3. శ్రీ సిం. మా. 1-95
4. శ్రీ సిం. మా. 1-97.

ఈ గుడి ద్వారము పడమటి దిక్కు, దేవుని ముఖము పడమటి దిక్కు, గంగా ప్రవాహము పడమటి దిక్కే ప్రవహించును ఇట్టి స్వామిని దర్శించిన పాపములు నశించుననియు, ఇట్టి గంగా ధారలో స్నానము చేసిన "దురిత క్షయంబపస్మార కుష్ఠరాజ యక్ష్మాది రుజ్నివారము భువిని"[1] అని స్నానము చేసిన కల్గే ముక్తి సూచింపబడెను.

కం॥ వట విటపి క్రింద గయలో
ఇటుమతి పిండంబు విష్ణుపదమున నిడుమేల్
ఘటియించు గంగ ధారా
తటమున పిండంబొసంగు ధన్యాత్ములకున్[2]

సూర్యుడు కన్యాగతుడగుట, మంత్ర పూతంబైన పక్ష శ్రాద్ధంబు చేత, పితరు లేరీతిగా తృప్తి బొందిరో, ఆ తీరున సింహాచలంబున శ్రాద్ధమిడిన పితరు లెల్లరు తృప్తి బొందుదురని[3] కవి ఘంటాపథముగా చెప్పెను.

ప్రహ్లాదుని బ్రోవ నరసింహుడై అవతరించి పరమేష్టి చేత, శంకరుని చేత, అమరవరునిచేత పూజితుండయ్యెను. కిన్నరాదులచే, అనిత్య సిద్ధ విద్యాధర వసువాదులచే, నారదునిచే, లోకోత్తర, లోకోత్తముల చేత, సనకాది సత్తముల చేత, నృపతి పుంగవుల చేత, అర్చనలు గొనుచు సకల కామ్యార్థముల నిచ్చి సాకుచుండెను. భక్త వరదుడు, సింహాద్రి పాలకుండు[4] నై సింహాచలంబున నివసించెను.

ఇట్లు కొన్నాళ్ళ తరువాత పురూరవ చక్రవర్తి చేత నెల నెల ఆరాధింప బడుచుండెను. గంధయాత్ర, ఉపచారములచేత కొలువబడెను. కలియుగమున భక్తి గల్గిన మానవులు అపవర్గమార్గమును పొందుదురు గదా!

---

1. శ్రీ సిం. మా. 1-105.
2. శ్రీ సిం. మా. 1-108.
3. శ్రీ సిం. మా - 1 - 109
4. శ్రీ సిం. మా - 1 - 119

గీ॥ అవని నెవ్వడు మనుజ దేహంబు నొంది
దుర్లభంబును ముక్తి హేతుకమునగుచు
నలర సింహాచలంబున కరుగదేని
వాడు దేవుని చేతను వంచితుండు[1]

ఈ సింహాచలమునకు పోయినవాడు సంసార బంధము విడిచి విష్ణు పదమును పొందును. అరిషడ్వర్గమువిడిచి శమదమగుణ ప్రసిద్ధుడై యుండునని చెప్పెను.

గీ॥ కావున నెల్ల విధంబుల
గైవల్య పదంబు గోరు ఘనుడెక్కడికిన్
బోవక సింహాచలమున
పావనమతి నుండవలయు ప్రతి వాసరమున్[2]

సింహాద్రిని దర్శించినవారు ఇహపర ముక్తి గల్గి, ధర్మవర్తనులై దిన దినము ప్రవర్తిల్లు చుండుదురు. సింహగిరికి సరిరావు విలాసముల పట్ల కవి.

ఉ॥ అన్నగరాడ్గృహాంతరములందు నితాంతరతి ప్రకాములై
పన్నగ కిన్నరామరులు భాసురబంధ విశేషవైఖరిన్
ఖిన్నత జెందకెప్పుడును గ్రీడ యొనర్చుచు నుందురాత్మయో
షిన్నివహంబులంగలిసి చిత్ర విలాసములుల్లసిల్లగన్.[3]

గంధర్వపతులు ప్రజలు నిరంతరము సానువులనుండి హరిచరిత్రను గానము చేయుచుండిరి బ్రహ్మాది దేవతలు శ్రీహరిని అహర్నిశంబులు ప్రస్తు తించిరి. అచ్చరలు నృత్యము చేయుచుండిరి. షట్కర్మరతులైన వినయవంతులు

1. శ్రీ సిం. మా - 1 - 117
2. శ్రీ సిం. మా - 1-20
3. శ్రీ సిం. మా - 1-128

ప్రతి దినము నృసింహుని పూజింతురు. మర్త్యకోటి మచ్చికతై పుష్పబాణుడు చూచుచుండెను. మునిశ్రేష్ఠులు కందమూలాది ఫలములు తినుచు, నిత్యము తపంబాచరించుచు సిద్ధయోగ పరంజ్యోతులై నృసింహుని ధ్యానించుచుండిరి. ఓషధులు మాణిక్య దీపాల వలె వెలుగొందుచుండెను. చంద్రకాంతులు వెదజల్లు చుండెను.

చం॥ నరునకు భూ ప్రదక్షిణ మొనర్చిన మేలొనగూడు సింహభూ
ధరమునకున్ బ్రదక్షిణము తద్దయు భక్తి నొనర్చెనేని భా
స్వరమతితోడ దన్మహిమ వర్ణన సేయగ ధాత్రి లోననె
వ్వరికి దరంబుగాదు మునివల్లభులార నిజంబు దెల్పితిన్.[1]

మరియు ఈ క్షేత్ర మాహాత్మ్యమును మిక్కిలిగా ఈ వచనమునందు జైమిని తన శిష్యులతో ననుట.

ఏకాదశి సమామాస్య పౌర్ణిమములను సంక్రమాణంబులను ఈ మాహాత్మ్యంబును వినువారును ఘోర పాపములు బాయుదురు అని జైమిని మునీంద్రుడు చెప్పగా వినిన శిష్యరత్నంబులు తెలుప ప్రార్థించిరి. ఇతిహాస పురాణములను, ఇట్లు తాను వివిధ భాగంబులందు వివిధ శాఖలు వహించుచున్న శ్రీహరిని గూర్చి ఇట్లనియెను.

హిరణ్యాక్షునిచే జనులు పీడింపబడుచున్నారు. వానిని ద్రుంచి జనకోటిని ఉద్ధరింపుము. మంధరము క్రింద కమఠాకృతివై అమృతాన్నొసంగితివి గదా! అని పొగడగా శ్రీహరి రెండవ వింధ్యవలె పెరిగిపోయెను. మేఘ ఘర్జన సమానముగా ఘర్జించి, పాద ఘాతంబుచే భూమిని ద్రొక్కెను. బలిని ద్రొక్కిన రీతిని నిశాచరుని చంపదలచెను. గత భయుండును, భీకరాకారుండైన హిరణ్యాక్షుడు మంధరాది పర్వతాదులవలె కదలెను. వెన్నుడిపై నిశాచరుడు గదయెత్తి

1. శ్రీ సిం. మా. 1 - 184

ద్రిప్పుచు నిర్భయముగా పోరాడజొచ్చెను. అట్టి యెడ హరి అసురుని రొమ్ము బట్టి కాండమువలె చీల్చి పడవేసెను.[1]

కుటిలాత్ముడైన రాక్షసుని క్రింద బడవేసెను. అప్పుడతడు ధాత్రిపై బడి మెల్లగా లేచి కోపముచే గదయెత్తి నేలపై గొట్టెను. ఆ చప్పుడు వినిన శ్రీహరి యజ్ఞవరాహుడు వజ్రమువంటి కొమ్ముతో కుమ్మి పొట్టచీల్చెను. నీటమునిగి ఉరగనిలయంబునందున్న పుడమిని కొమ్ముతో లేపెను. సురలు సుధలు కురిపించిరి. ఇట్లు హిరణ్యాక్షుని కథను జైమిని తన శిష్యులతో చెప్పెను.

ఉమారమణుని కరుణా కటాక్ష వీక్షణము చేత కవిత లభ్యము గావించి నట్లును, ఇతని గోత్రము కౌండిన్యస, గంగనామాత్య పుత్రుండును బుధజన సేవితుండును, తిమ్మన నామధేయుండును యగు కవి సింహాచల క్షేత్ర మాహాత్మ్యంబు అను పుణ్య చరిత్రయందు ప్రథమాశ్వాసమని పేర్కొనినాడు. ఇట్లు తెలుపుటవలన కవి వంశము గ్రహించబడును.

దేవేంద్రుని శాపమా? యన్నట్లుగా వడగళ్ళ వర్షము గరిసెను. ఇది ఖేచర బాలికలు జల్లిన సేసబ్రాలువలె తోచెను. ఇట్టి యెడ ఘోరతపోనిష్ఠను బ్రహ్మకు నివేదింపబోవు రాయంచ జంటలా యన్నట్లు తిరుగసాగెను. ఇట్టి యడవిలో హిరణ్యకశిపుడు పదివేల సంవత్సరములు తపమాచరించెను. ఇంద్రుడు అప్సరసలతో నిట్లనియె: ఓ కన్యకలారా! మీరు తక్షణమే అసురునిచేరి మచ్చికతో కోరికలు దీర్చి తపము మాన్పించండి యని ఆదేశించెను.[2]

గీ॥ దేవ దేవ నీవు తిరముగ వరమిచ్చె
దేవి నీదు సృష్టిలోన గలుగు
భూత తతులచేత బొలయకుండునటుల
గోరినాడ కరుణమీర నిమ్ము[3]

---

1. శ్రీ సిం. మా. 1 - 182.
2. శ్రీ సిం. మా. 2 - 45.
3. శ్రీ సిం. మా. - 2 - 81.

కం॥ సురనుత శస్త్రాస్త్రంబుల
దరుశైలాధికముల (చేత) ధరణీస్థలినం (నం)
బరమున బాతాళంబున
మరణము లేకుండునట్లు మక్కువ నిడవే[1]

గీ॥ పుడమినెవరికి నాతోడ దొడరిపోరి
దరము కాకుండునటులను వరమొసంగి
ఋషివరేణ్యుల శాపమొకించుకైన
జెందకుండునట్లుగా జేయు మీశ[2]

"ఋషివరేణ్యుల శాపమొకించుకైన" అని చెప్పుటవలన ఈతనికి ఋషీశ్వరుల శాపభయముండెనని గ్రహించబడును. పై రీతిగా వరము నిమ్ము లేనిచో మొదటి తీరుగా నేతపమొనంచెదనని బ్రహ్మతో బల్కెను.

గీ॥ "అమరవరులిందు నెపుడు ద్రోహంబొనర్ప
దగదు సుర భూమి సురవిరోధంబు వలన
సతులగఁచుట వలనను జాల బ్రజలి
పురుషుడు సుఖింప దేలాటి వరములున్న"[3]

ఇట్టి వరములిచ్చి చెప్పిన తర్వాత దేవతలు ఇంద్రుడు వారివారి నగరములకరిగిరి. ఇతడెప్పుడు తముపై దాడికి వచ్చునో యని దేవతలు భీతిల్లిరి. బలవంతుడై హేమవతీ నగరము నవలీలగా నసురుడు పాలించుచుండెను.[4]

---

1. శ్రీ సిం. మా. 2 - 82.
2. శ్రీ సిం. మా 2 - 88.
3. శ్రీ సిం. మా. 2-87.
4. శ్రీ సిం మా. 2-91.

కొన్నేళ్ళకు పాత కక్షచేత దైత్యుడు ఆ సురపురిపై చతురంగబలాన్వితుండై స్వర్గముపై దండెత్తెను. ఈ సంగతి గ్రహించిన దేవేంద్రుడు గణములతో గూడి రాక్షసునిపై సమరమునకు సిద్ధమయ్యెను. ఇంద్రుడు శతసంఖ్యల దానవేశ్వరుల ద్రుంచెను. శమనుడు కాలదండముచేత మితిలేని భయంకరాకారులను ద్రుంచెను. కుబేరుడు గదచేత ఘనబలాన్వితులైన దైత్యనాయకుల చీరెను. సముద్రుడు పాశముల దైత్యేయుల నొక్కటిగా చీల్చెను. కిన్నరాదులు, గరుడ, గంధర్వాదులు సమరములో రాక్షసుల చీల్చిచెండాడిరి. ఈ విధముగా దేవతలచే రాక్షసులు నిలువక మడచిరి. ఇంద్రునకు దైత్యునకు పోరు ఘోరముగా సాగెను. అందులో దైత్యుని రథచక్రములను ముక్కలు గావించెను. ఉగ్రుడైన అమరాదిసురలపైబడి నొప్పించెను. వారందరు ఓడిపోయి భూలోకము చేరి దాగిరి.[1] బ్రహ్మ వరమువలన రక్కసుడు ముల్లోకము నేలెను.[2] యాగభాగము లపహరించెను. దేవతలందరు బ్రహ్మదేవుని గలసి ఇడుముల నివేదింపగ నతడు నేను యిచ్చిన వరమును నేపరిమార్పగరాదు. కావున విష్ణువే కడ తేర్పగలడని భావించి, వైకుంఠమునకు వెళ్ళిరి. నవరత్నముల కాంతులచేతను, పాలరాళ్ళతోను స్వర్గగృహములు వెలుగొందెనని గలదు.[3] ముక్తవాసనులైన విముక్తజనులు శోకములేక నుండెడి హరిమందిరము చేరబోయిరి. ఈ దేవతల జూచిన సుముఖుడను ప్రతీహారుడు విముఖుడై అదలించి, గృహ ద్వారము చేరగనీయక వారించి ఆ సురలకు నిట్లనియె.[4] యోగనిద్రలోగల సుందర శ్రీహరి మందిరము పోరాదని వారింపగ బ్రహ్మాదులచటనే ఉండిరి.[5]

## ప్రతీహారుండు (సుముఖుడు) బ్రహ్మాది దేవతలు తమ దర్శనముకై వచ్చిరని శ్రీహరికి చెప్పుట

ప్రతీహారునిచేత నివారింపబడి దేవతలు నిలువగా కొంత వడికి సుముఖుడు తెలివొంది, అయ్యో, దేవతల నాపితినని గ్రహించి, వెంటనే శ్రీహరియున్న అంతఃపురంబునకు జనుదెంచి బ్రహ్మాదిదేవతలు తమ దర్శనార్థమై వేచియున్నారని విన్నవించెను.[6] ఇది విన్న విష్ణువు దిగ్గునలేచి పాదుకలు దొడిగి దేవతల

---

1. శ్రీసిం.మా.2-126 2. శ్రీసిం మా 2-127 3. శ్రీసిం.మా.2-136
4. శ్రీసిం.మా.2-148 5. శ్రీసిం.మా.2-152 6. శ్రీసిం.మా.2-54

గలువవచ్చెను. హరి దేవతల రాక విశేషంబు నడుగ వారు విషయంబెరింగింపుడు, చివరికి తమ ప్రతీహారిచేత కూడ నివారింపబడితిమని "జనకుని యెడ దనయులేడ్చు చందము దోపన్" ఏడ్చిరి. అప్పుడా హరి మీరిక భీతిని త్యజించి తమ తావులకు బొండు. నేను భయంకర రూపంబు దాల్చి చీల్చెద, మిమ్మెవ్వ డిచ్చట నాపెనో వాడే నీని వధకు కారణభూతుడగు నని నుపశమింప జేసి పంపెను.

## సుముఖునకు విష్ణువు శాపమిచ్చుట

కం॥ కరము మొఱయిడుచు వచ్చిన
శరణార్థుల నాపినట్టి జడుడవు నీవా?
సురరిపునకు దనయుడవై
సరగున జనియించుమింక జగతిన్ గుమతీ![1]

అని శపించెను. మాకు ఎదురొడ్డినవాడు, అడ్డగించినవాడు దండింపబడును. కావున ఓ సుముఖ, నీవసుర యోని నుద్భవించుమనగా నాతడు కరయుగ్మంబులు మొగించి వెరపొందక దగ్గరికి జని, ఓ పరమేశ్వరా, నీ దాసుడనైన నన్ను నింత దండిగా దండింపదగునా? దేవతలు తమ వేడ్కకై రాగనే కర్మాధికారులైన వారి నడ్డగించితినంతే.

సీ॥ కమలజ బలరిపు ప్రముఖ గీర్వాణులు
కర్మాధికారులై పేర్మితోడ
జగదీశ యెపుడు నీ శాసనంబున నే మె
లంగుచు వినికొసంగుకొనుచు
నన్యులచే దమకర్చనల్ గైకొంచు
కడు వేడ్క స్వర్గ లోకంబునందు
నీ చేత నెందాక నియమింపబడియుండు
నందాక దరలకయుందురిపుడు

1. శ్రీ సిం. మా. - 2 - 179.

గీ॥ వారు తమతమ సర్వాధికారములను
విడిచియుందురు నొకమారె వెడలిరాగ
దన్నిమిత్తంబుచేనిట్ల ద్వార సీమ
జాగు నిల్పితిగాని రోషమున కాదు[1]

అని సుముఖుడు వేడుకొనగా, ఓ సుముఖా నీవు అసురయోని జనియించినను సజ్జనుండవును, నాకు భక్తుండవు నగుదువు నా నామ కీర్తన చేయుచుండుము నిన్ను బ్రోచెదను.

గీ॥ శిష్ట జన రక్షణంబుకు దుష్టజన వి
దారణంబును ధర్మ సంస్థాపనంబు
జేయుకొరకె జగంబుల జిత్రలీల
లంర బ్రతికల్పమున బూని యవతరింతు[2]

అట్టి అవతారములలో దుష్టుల ద్రుంచెదను [3] నాలో నైక్యంబు నెవ్వడు కోరునో వాడు జ్ఞాని, భూతకోటుల భేదబుద్ధి నెవ్వడు జూచునో వాడు ప్రియుండు గాడు.

"వినుము నిక్కంబు దెల్పెద వేయునేల
నా యెడలనైన నేరమొనర్చువాని
గాచెదనుగాని మద్భక్త గణములందు
ద్రోహమొనరించువాని నెందును సహింప"

అందువలన సుముఖుడా నీవరుగు మింక నాలస్యము చేయదగదు అని హరి చెప్పిన విధమును జైమిని యెఱిగింప విని మునీంద్రులెల్ల సంతసించి, ఆవలి కథ చెప్పుమని యడిగిరి.

---

1. శ్రీ సిం. మా. - 2 - 185.
2. శ్రీ సిం. మా. - 2 - 190.
3. శ్రీ సిం. మా. - 2 - 195.

దైత్యుని భార్య (దితి) గర్భము దాల్చె, అసుర నపకీర్తికొాల ది కలికికి గర్భము పెరుగుచుండె[1]

సీ॥ విబుధారి యపకీర్తి విస్తరిల్లెడు రీతి
కలికికి నూగారు గారుకొానియె
దనుజేంద్రుసేగి సూచనసేయు కైవడి
పడతికి హారముల్ భారమయ్యె
సురలింక మదిజొక్క సుఖింతురని తెల్పు
టొప్పున జెలికిగన్ చొక్కలొాదవె
జగములు మూడు నిమ్మగ నుబ్బునన్నట్లు
లలనకు వళుల స్రుక్కలును దీరె

గర్భగోళార్భ కాంతరంగంబునందు
బొదలు హరి రోషభీషణ స్ఫురణమీర
నసురపతిమీద మాటికి గసరి హుంక
రించె ననమూర్పుగము లంకురించె సతికి

అని తిమ్మకవి నిండు చూలాలి కాయమును వర్ణించి, అచ్చ తెలుగు ఇల్లాలి గుణములను ప్రకటించెను.

పొలతి శుభదినంబున కొడుకునుంగనియె[2] పురోహితులు ప్రహ్లాదునికి నామకరణము జేసిరి.[3] పెరిగిన ప్రహ్లాదుడు పరతత్వ బోధన చేసెను.[4] హరిని కీర్తించసాగెను. విశ్వమున జనార్దనుడే తప్ప నితరులు కానరాని హర్యుపాసన మొనరించిన సిద్ధి పొందెదనని నుడివెను. "భూతములయందు దన్నును బొస గనఖిల - భూతములు దనయందు నెప్పుడును గనుచు"[5]నని సర్వాంతర్యామిని కొలిచెను. బాల్య, కౌమార, యౌవన, వార్థక్యంబులు చేయు పనులు చూసెను[6]. ఇది కాళిదాసాదులు పేర్కొనిన తీరుగా ప్రకటితమైనవి. ఇట్లు మూడు సంవత్సరముల వాడయ్యెను. తర్వాత గురువున కప్పగించెను. అతడు "ఓం నమశ్శివాయ"[7] అనుమనగా "నమో నారాయణాయ" యని చదువసాగెను.

1. శ్రీ సిం.మా. 3-7.2. 2. శ్రీ సిం.మా. 3-12. 3. శ్రీ సిం.మా. 5-15.
4. శ్రీ సిం.మా. 3-22. 5. శ్రీ సిం.మా. 3-39. 6. శ్రీ సిం.మా. 3-52.
7. శ్రీ సిం.మా. 3-65.

గీ॥ వినుడు జన్మాంతరంబున విష్ణుచేత
నాకు నే బుద్ధి విహితమై నాటుకొనియె
నదియె యిప్పుడు సంప్రాప్తమయ్యెగాని
యన్యుడుపదేశమిడుట లేదనఘులార!

అని గురువులకు ప్రహ్లాదుడు నుడివెను.

పంచాక్షరీచేత ప్రపంచంబు ఉద్భవించె. చతుర్వేదములు నిలిచె, నారాయణ జపము చేయునరుడు నారాయణుడే.

గీ॥ ధరదమోగుణులై యద్దైత్యులెచట
సత్వగుణుడై విరాజిల్లు చక్రియెచట
తగిల యుపదేశమగుటకు తగకయున్న
శౌరిని స్మరింప యోగ్యులుగారు వీరు[1]

ఈ మాటలు విని గురువులు కోపోద్రిక్తులై

కం॥ ఇసుమంత గలవు మిక్కిలి
పసిబిడ్డదన్ని క్రియల బల్కెద వహహా,
వస ద్రాగిన పిట్టవలెన్
విసువక మదినించుకైన వెరపక గుణ్డా[2]

హరినామ స్మరణ మాని, శివ స్మరణ చేయుమని, లేనిచో నీ తండ్రి దండించువాడనియు దానికి మేమేమి చేయువారము యని బల్కిరి. అంతట తండ్రి నన్ను గన్న తండ్రి నావీనుగవ కింపు-గదుర బలుకవయ్య ముదముతోడ[3] అని అడిగి పెక్కు విధంబుల శిక్షింపనెంచి గజంబులచే ద్రొక్కించె, సర్పంబులచే కరిపించె గాని వినడయ్యెను. తర్వాత నతడు

1. శ్రీ సిం. మా. 3-74
2. శ్రీ సిం. మా. 3-77.
3. శ్రీ సిం. మా. 3-86

గీ॥ ధరణి తలమునే ప్రభు స్మరణ మాత్ర
మున పవిత్రత గాంతురు పుల్కసాధు
లట్టి ప్రభువిష్ణునకు పరమాత్ముడైన
విష్ణునకు వందనంబు గావింతునెపుడు[1]

అనే ప్రహ్లాదుడు తన కీర్తన మానకుండెను.

గురువు లింత విన్నవించిన నా బాలుడు విసకయు, వారితో నిట్లనియె:

గీ॥ పుట్టినది మొదలంతంబు బొందుదాక
హరి భజించు మహర్షు లొకప్పు విఘ్న
ము లక్షణం బెడయైనచో గలగి శోక
మందు చుండుదుర విహితులైన కరణి[2]

అని వారితో విన్నవించెను.

గురువు లెన్నో విధంబుల నీతులు బోధించి హరికీర్తి మాన్పింప జూచిరి. కాని అది గానరైరి. చివరకు నబ్బాలునితో గురువులు

గీ॥ ఓరి బాలక మామాట కేరిమీరి
యెన్ని దెరగుల చెప్పిన నెఱుగలేక
ప్రేలుచున్నావు దైత్యేంద్రు ప్రోలనిటులె
పలుక నిక నేమి యయ్యెదో పదమటంచు[3]

వెళ్ళిన పిదప తండ్రి తనయునితో బాలక "నీకు పినతండ్రి యగు హేమనేత్రు జంపినట్టి యహితుని మాటికి నభిమతముగ దవిలినుతియింప రాదు కదా! కుమార[4]" అనగా కొడుకు తండ్రితో "శత్రుమిత్ర భేదములను చక్రి కెపుడు గలుగ నతడు సమస్త జగన్మయుండు[5] పల్కెను. అపుడు తండ్రి తన

1. శ్రీ సిం. మా. - 3-145.
2 శ్రీ సిం. మా. - 3-153.
3 శ్రీ సిం. మా. - 3-167.
4. శ్రీ సిం. మా. - 3-176.
5. శ్రీ సిం. మా. - 3-183

యుని జంపించ దాసవుల కాజ్ఞాపించగ పర్వతముపైనుండి బడవైచిరి. సముద్రములబడవైచిరి. సముద్రుడు ప్రహ్లాదుని లేవనెత్తి కౌగలించుకొనెను. ఇట్టి కథను జైమిని తన శిష్యులకు వినిపింప, తక్కిన కథ చెప్పుమని నారదు డడిగెను.

ఇట్లు ప్రహ్లాదుని బాధించుచున్న రాక్షసాధములు దోయగ అబ్ధిలోబడిన బాల కుమారుని రక్షించబోవుచున్నట్లు సూచ్యుడు గ్రుంకెను. భక్తుండగు ప్రహ్లాదుండు భగవంతుని నానా రూపముల స్తుతించి తన్ను బ్రోచుమని ప్రార్థించె సంతలో శ్రీహరి భక్తుని అబ్ధినుండి బ్రోచెను.

ఆ.వె॥ దేవ యీజగంబు నీవె నీ కంటెను
జగము వేఱుకాదు జగము కంటె
నీవు వేఱుగావు నిక్కంబు పరమార్థ
మీవయగుదువాత్మ - నెఱిగి కొనిన[1]

అని భగవంతుని స్తుతించెను. హరి ప్రహ్లాదునకు దర్శన మిచ్చెను. నా దర్శన భాగ్యము లభించిన వారికె మోక్షంబబ్బునని యానతిచ్చెను[2].

ఆ.వె. ఏవుతో ప్రచండ రూపంబు ధరియించి
లేవు నిశ్చల ప్రతాపుడైన
నీదు జనకుద్రుంతు నిక్కంబు నీవపు
డాత్మలోన భీతి నందవలదు[3]

అని హరి ధైర్యము చెప్పెను. నీవు లేవు నన్ను చూపుమని నీతండ్రి ప్రశ్నింపగా స్తంభము నందుద్భవింతునని చెప్పి నదులనుద్భవింప చేసిన విధము జెప్ప దొడంగెను. వరము వేడుమనగా నిరతము నీ కీర్తన లబ్బునట్లు కోరెను.

1. శ్రీ సిం. మా. 4-35.
2. శ్రీ సిం. మా. 4-44.
3. శ్రీ సిం. మా. 4-46.

మరియు దైవపరంబైన జంతువుల చేతను నన్ను పీడింపకుండునట్లు పరమిమ్మని ప్రార్థించెను[1]. అంత నా స్వామి అంతర్హితుండయ్యెను

రాజమార్గమున పోవుచు దనుజ తనూజుడు హరినామము స్మరించు చుండెను. అబ్ధిలో బడదోచి గిరివేసిన రక్కసులు భీతిల్లి నీ తనయుడున్నాడని విన్నవించిరి. తోడ్కొని రమ్మనగా వారు గొని తెచ్చిరి. మత్కుమారుని జూచి తండ్రి కౌగలించుకొని పుత్రా! నేను నీకేమి కీడు చేసితినో అన్ని రంగములలో నీవే గెలిచితివి. కారణము నీయందు హరియుండనోపు. కాని నాకు సుఖము గలుగ జేయుము. శోభ నొందింపకుము అని కోరెను.[2]

గీ॥ తండ్రినీవేమిటికి గుందెదవు మదీయ
భాషణముల జలించుచు బహువిధముల
బాలకుడైన నేను నీ ముందుల నేమి
పలికి నాడను కొరగాని పలుకు చెపుమా![3]

అని తనయుడు తండ్రితో విన్నవించెను. నీతి చెప్పిన తనయునిపై గినిసి కసిదీర కోపించి నిట్లనియె.

గీ॥ బాలక! నిజంబుగా హరి సర్వగతుడ
టంచు నీమది నిశ్చితంబయ్యె నేని
యెచట గన్గొన గోరిన నచట నీవు
నిలిచి వానిని జూపింప గలవె నాకు[4]

అని నబ్బాలుని ప్రశ్నింపగా నతడు—

1. శ్రీ సిం. మా. 4-56.
2. శ్రీ సిం. మా. 4 - 81.
3. శ్రీ సిం. మా. 4 - 83.
4. శ్రీ సిం. మా. 4 - 93.

ఎచ్చట జూచిన హరిగలడని సర్వాంతర్యామి యని చెప్పగా క్రోధంబుతో దైత్యుండు-

గీ॥ రోషమిగురొత్త సుతుని శిరోరుహములు
పట్టుకొని చేత గంబంబు గొట్టి యంతు
జూపుమా రేపు మాపును నీపదంటె
విడువ జాలక పలికిన విష్ణునని[1]

వెంటనే ఆ నృసింహ స్వామి గర్జించి సూక్ష్మరూపమున కంబమున బుట్టి మేరువు భంగి పెరిగెను. నృసింహుని భయంకర రూపమును కవి మిక్కిలిగా వర్ణించెను.[2] అనేక ప్రకారముల నానా రూపధారులై ఇరువురు పోరాడిరి[3]. రాత్రించరులను కుప్పలుగా గూల్చి, విష్ణురూపము మాయలు జూచిన బుధేంద్రులు నుతింప సాగిరి. ముప్పది రెండు రూపంబు ధరించి నృహరి "అందు ఘోరాతి ఘోర శాంతంబులు ముప్పది రెండు రూపంబులు ప్రశస్తంబులై పురాణంబుల యందు మునీంద్రులచేత చెప్పంబడు నవియెయ్యవి యనిన; నద్భుతాకృతియగు కుండపాచాఖ్య నృసింహుండును, సముద్ర నరసింహుండును, విశ్వరూప నృసింహుండును, నరసింహుండును, క్రూరసింహుండును, బీభత్స నృసింహుండును, రౌద్రసింహుండును, వహ్ని సింహుండును, వ్యాఘ్ర సింహుండును, భీమ సింహుండును, పాతాళ సింహుండును, తారక్షవాహనుండగు నాకాశ నృసింహుండును, వజ్రసింహుండును, చక్రసింహుండును, శంఖసింహుండును, సత్యసింహుండును, అద్భుత నృసింహుండును, వేగ సింహుండును, విదారణ నృసింహుండును, ఘోర సింహుండును, నుగ్రసింహుండును, శాంత సింహుం

1. శ్రీ సిం. మా. 4 - 100.
2. శ్రీ సిం. మా. 4-105
3. శ్రీ సిం. మా. 4-114.

డును, యోగిజనధ్యేయ విగ్రహుండగు యోగానంద నృసింహుండును, లక్ష్మీ నృసింహుండును, భద్ర సింహుండును, సర్వలోకాభయ ప్రదుండగు రాజ సింహుండును, సింహశైల నికేతనుండగు వరాహ నృసింహుండును, సర్వ లోకంబులకు భుక్తి, ముక్తి ప్రదాయకులు. ఇవి భూత భవిష్యద్వర్తమానంబుల నరసింహ రూపంబులని" ఆ తరువాత సాయంకాలంబుగా జొచ్చె. మేఘ మధ్యం బుల నుండి దేవతలు ఇట్లు విన్నవించిరి. దేవా! రాత్రి యైనచో వారికి బలం బెచ్చుగానోపు తక్షణమే వీనిని జంపుమని వేడుకొనిరి.

అంత శ్రీహరి "హరి రొమ్మును బట్టి చించు హరిపతి భంగిన్" చంపెను. దేవ దుందుభులు మ్రోగెను. విరులవాన గురిసెను. లక్ష్మీదేవిని స్తుతించిరి. సము ద్రుడు హరికి అభిషేకము చేసెను. ప్రహ్లాదునికి వివిధ రీతిగా నీతి బోధించిన వాడై, పట్టము గట్టిన పిదప తాను శాంతమూర్తియై, కృత శౌచమున హరం పావమునకు, సిద్ధ సేవితమైనట్టి సింహశైలమున నహోబిలంబున బ్రియంబున వసించె.[1] ప్రహ్లాదునకు పరిణయంబయ్యె. నతనికి విరోచనుడను సుతుడుద యించెను. మునీశ్వరాదులు ప్రహ్లాదుంశాసనమున వసించిరి. క్షితిపైననేకము లగు క్రతువులు సాగుచుండెను. ఈప్సితము లీడేరెను. భక్త ప్రహ్లాదుండు అనేక మఖమ్ము లెమ్మితో నొనరించెను. ఇట్లనేక హాయనములు రాజ్యంబు నేలుచుండె నని జైమిని తన శిష్యులతో కథ నెఱింగించెను ఇట్లు పురాణ ఫక్కీన, ప్రబంధ వర్ణనతో రచన సాగించిన తిమ్మన ఘనుడు.

ఇట్లు ధర్మ మార్గ ప్రచారుండై ప్రహ్లాదుండు రాజ్యంబు నేలుచుండెను. ఇట్లుండ నొక నాడు తన మనంబున దోచిన రీతి గావించె. తన కుమారుండగు విరోచనునికి రాజ్యాభిషిక్తునింజేసి. బంధు పురోహితాదుల గూడి పూజోపకరణ ములు గ్రహించి బహుదూరమేగి సింహశైలమున్ గాంచెను. అచట ప్రాకారాది గోపురంబులు జూచి, గుడిని శుచిగావించి హరికి స్నానంబులు గావించి అష్టో

1. శ్రీ సిం. మా. 4-160.

త్తర నామావళి స్తుతించి, పీతాంబరంబుల గట్టి చందనంబులు బూసి, కర్పూర దీప ధూప నైవేద్యాదులు సమర్పించె. నరసింహుని శిరమున చూడా రత్నము నిడె. ఇట్లు నానా భూషణాదులు ధరింపజేసె. బహుప్రకారంబుల ప్రార్థించి నిజ గృహంబున కరిగె. బ్రహ్మదేవుడు విష్ణువును స్తుతించె అవతారఘట్టాది వర్ణనలు గావించె. నీవు కల్పాంతాగ్నివిభుడవై నాచేత కనుగొన బడితివి గదా! అవని యందు నరసింహ రూపంబులందు సౌమ్యమూర్తి యెద్దియో నాకది యెరింగింప గోరినాననని బ్రహ్మ విష్ణువుకు వినతి జేసె. విష్ణువు వినించితో నిట్లనియె :

గీ॥ ఆ హిరణ్య కశిపు నణచి ప్రహ్లాదుని
చేత బూజగొనుచు సింహనగము
నందు శాంతమూర్తి నగుచు శ్రీయుక్తుడ
నై వసించినాడ నహరహంబు[1]

అని విన్నవించె. అంతేగాక చైత్ర శుద్ధ ఏకాదశి నాడు ప్రహ్లాదునిచే మహో త్సవంబు జరుపబడు. అమరులు మీరు నచ్చోటికి మహర్షులతో నేతెంచుడు. జాగు చేయక విధిగా దీనిని గావింపుడు. అప్పుడు మనుజులెవరైన శ్రద్ధతో దర్శించి, పూజించిన మత్పదంబునకు చేరుదురు.[2] అట్లుగాన నీవు సింహాద్రి కరుదెంచి యద్భుతమూర్తినై యలరు నన్ను దర్శింపుము. అనగా బ్రహ్మాది దేవతలు భూలోకమున గల సింహాద్రిని దర్శింప నారసింహ ప్రహ్లాదుల జూడ దేవర్షితో సహా వచ్చి వాంఛిత ఫలప్రదులైరి. సింహనగ వర్ణన మమితముగా గలదు.[3] ఇది అరణ్య వర్ణన అతి మనోహరముగా కవి వర్ణించెను. చిత్రకేతన వితానంబై సింహరుచి, కర్పూర ధూప వాసనోద్భాసితంబును గల్గియుండి, అనేక ప్రాణి నివాసంబును, సింహాకారంబును గల నృసింహాధిష్ఠ పశ్చిమ ముఖంబును గల్గి వెలసిన దేవునిజూడ వినోదంబుతో విమానంబులు డిగ్గి వచ్చిరి. హరికి పూజ

1. శ్రీ సిం. మా. 5-56.
2. శ్రీ సిం. మా. 5-57
3. శ్రీ సిం. మా. 5-63.

లోనర్చెడి ప్రహ్లాదుని గూడ గాంచిరి. ప్రహ్లాదుండు భయంబుతో నొకమూల దాగి యుండెను. అట్టియెడ బ్రహ్మ యిట్లనియె: వత్సా! నీవు పరమాత్మునకు సంప్రీతుడవైతివి. నీకిక భద్రంబగు గాక! నీ మూలంబున విష్ణువిచట వెలసె. కృతార్థుడవు. నీ తల్లిదండ్రులు ధన్యులు. నీ పరిచారికలు ధన్యులు. అని చెప్పిరి.[1] మత్పూజ గావించుటకై విరూరుదెమ్ము అని బ్రహ్మ ప్రహ్లాదునిగోర, నతడట్లే గావించెను. పుష్ప ఫల, ప్రసీదములచే నలువ పొగడగ నమరులందరు జాగిలి మ్రొక్కిరి. అచ్చరలు పాడిరి. దేవ దుందుభులు మ్రోగెను.[2] అంత నా బ్రహ్మ హరికి అద్దేవుని దర్శనార్థమై రమ్య శిలాతలంబున ప్రీతియుండ, నారసింహవిభుని డెందమున నిలుపగ, ప్రసీద, హరే యటంచు దినత్రయంబు గడిపి తృతీయ దినంబునందు రేయి యలసి కన్మొయునంతలోన హరిని స్వప్నంబున గాంచెను. ఇట్టి శుభస్వప్న గోచరంబునుండి మేల్కాంచి, చూచిన ప్రహ్లాదుడిట్లు బలికె:

గీ॥ లెమ్ము లెమ్ము నృపాల మేల్కొమ్ము వేగ
భద్రమగు నేటికిటువలె బవ్వళించి
యసురవరులకు నైనశక్యంబు గాని
యట్లు మద్దర్శనంబిపుడబ్బె నీకు[3]

అరయగ విపుడిద్దరణీవల్మీకము పంచామృతముచే గడుగుము. గోచరించి నద్దేవునికి వస్త్రమాల్యా లేపనంబులచేత ధూపదీప హృద్యనైవేద్యములచేత నృత్త గీత వాద్యములచేత సన్నుతి వందనం బాచరించి, నిర్మల చిత్తవృత్తిచే పూజ చేయుమని పురూరవునకు ప్రహ్లాదుండు జెప్పె. ప్రతి వాసరమున చందనలిప్తత ముని ప్రజలు దర్శింతురు అక్షయ తృతీయకు ప్రతియేట చందనుని దర్శింతురనియు, ఆకాలంబున చందన మొలుచునున్న వాని వంశంబు నిర్వంశబగు

1. శ్రీ సిం. మా. 5-63.
2. శ్రీ సిం. మా. 5-66.
3. శ్రీ సిం. మా. 5-125.

నని నుడివె. నన్ను కాంక్షించు మనుజుండు చందన లేపంబొలిచెనేని తిరిగి స్నాన పూర్వకముగ నిర్వహింపవలె సుమా! వేగమే అవనినాథ అని బలికి దేవు డంతర్ధానమయ్యె. అంత మేల్కాంచి -

కం॥ లోకేశ్వరుడిచ్చోటనే
లోకేందు నిభప్రభన్ విరాజిల్లుచు వ
ల్మీకమున నున్న వాడుట
ప్రాకటముగ నాకు దెలియ బలికె వెలందీ[1].

అని ఊర్వశితో పురూరవుండనియె. వల్మీకము దాటిపోవ విమానంబు కదలదాయె. ఇదేమి చోద్యమో మగువా అని చింతించగా నూర్వసి ఓ రాజా! విచారింపదగదు. పరమేశ్వరుండానతిచ్చిన రీతి చేయదగును. అనగా నా చక్రవర్తి నానా దేశంబుల నుండి "క్షీర ధార సహస్రముల్ చిత్రముగను సరగ తెప్పించి" మరునాటి ప్రభాతమున లేచి సర్వ కార్యంబులు దీర్చుకొని శుచియై దేవి సమేతుండగుచు, క్షీరధారలచేత వల్మీకంబంతయు గడిగి చూడ స్వామి చరణాలు గానరావాయ్యె. నంత విచారించగా ఆకాశవాణి యిట్లనియె:

గీ॥ ధరణి వల్లభ చింత నొందకుము నృహరి
పద సరోజాతములు కనంబడవటంచు
నవి ప్రయత్నంబుచే దాపనయ్యె స్వామి
చేత ముక్తి ప్రదంబులై క్షితితలమున

అని పలుక పురూరవుండట్లే కడిగి, షోడశోపచారములు పూజించి, సుగంధాది లేపనంబులు బూసి "శ్రద్ధతో ప్రయత్న పరుండవై గప్పుము" దివ్య రూపం బగు నృసింహుని గాంచనగు ననెను.

---

1. శ్రీ సిం. మా - 5-134
2. శ్రీ సిం. మా - 5-139.

ఇంకను నిద్దేవుని నెవరు ఏటేట నక్షయ తృతీయ (వైశాఖ శుద్ధ తృతీయ) నాడు వీక్షించిన పుణ్యులగుదురు అని యశరీరవాణి బల్కెను. అపుడు గంధర్వా దులు పొగడ, ప్రహ్లాదాదులు స్తుతింప, కృతాచియు మేనకయు మొ॥గు నచ్చరలు యుత్సవంబున నోలాడిరి. సురదుంధుబులు మ్రోగెను. శిల్పకారుల చేత నరాజు విమాన మంటపాదికంబులు గట్టించె. కామితార్థులకు స్వామి వరము లిచ్చె. ఉత్సవములు గాగ మిగిలిన దినంబులలో "వివిధోత్సవములు చేయించె వారికి హరి ముక్తి కల్గించును. ఇట్లు చేసిన సార్వభౌముడు విష్ణు లోకమును బొందెను. ఇట్లు ఏతెంచిన రాజులందరు పూజలు గావింప జొచ్చిరి. ఇంకా కలియుగంబున నృపులచేత పూజింపబడునని ఈ ఉత్సవంబులలో పాల్గొనిన వారు వారి పితరులును ధన్యులగుదురు. మరియు-

కం॥ ముదమున నీమహామాహాత్మ్యము
చదివిన లిఖియించిన వినిన జనులకు సతతా
భ్యుదయ పరంపర లగుదురు
తుదిని విష్ణుని పురంబు దొరకుందిరియై[1].

అని చెప్పదొడంగెను.

# 3. శ్రీ సింహాచల మాహాత్మ్యము

## క్షేత్రమాహాత్మ్యమా? ప్రబంధమా? పురాణమా?

శ్రీ సింహాచల మాహాత్మ్యము క్షేత్ర మాహాత్మ్యమే అయ్యు ప్రబంధ వర్ణనలతో కూడినది. ఇది పౌరాణిక సంబంధిత కథలు అనగా గురువు తన శిష్యులకు శ్రీహరి కథను చెప్పుటచే పురాణ మార్గమును నవలంబించింది. సింహాచల క్షేత్ర వర్ణన లధికము.

1. శ్రీ సిం. మా - 5-168.

శ్రీ వరహావతారము, హిరణ్యాక్ష సంహారము, ధరణి ఉద్ధరణము అనునవి ప్రంబంధ వర్ణనలు గల్గియున్నవి. హిరణ్యాక్షవధానంతరము హిరణ్యకశిపుడు ఘోర తప మొనర్చుట, వరములు పొందుట, బ్రహ్మాది దేవతలు శ్రీహరిని వేడుట, సుముఖుని దైత్యపుత్రునిగా శపించుట పురాణ ఫక్కికి చెందినవి.

హిరణ్యకశిపుని శ్రీహరి నృసింహుడుగా నవతరించి సంహరించుట లోక రక్షణార్థము జరుగుట పురాణ ఫక్కియే. ఈ కథానాయకుడు శ్రీహరి; ఉపనాయకుడు హిరణ్యకశిపుడు. ఇందలి కథ అఖ్యానములుగా నుండుటచే సాఫీగా సాగలేదు. కథ నృసింహుని ఇతివృత్తమేయైన క్షేత్ర మాహాత్మ్య ప్రధానమైనది. సింహాద్రిని, స్వామిని, గుడి ప్రాకారాదుల వర్ణనలును చూచిన క్షేత్ర వర్ణనలు కన్పడును. కావున పురాణ ఫక్కిగా నడిచి ప్రబంధ వర్ణనలు గలిగిన క్షేత్ర మాహాత్మ్యమైన సింహాచలము భూలోక వైకుంఠముగా వర్ణింపబడినది.

## 4. వర్ణనలు

**1. హేమవతి పుర వర్ణన :**

ఈ నగరమును హిరణ్యకశిపుడు పాలించుచుండెను. దీని నెన్న బ్రహ్మకైన నలవి కాదు. కైలాసాది దేవతలు నివసించే మేడలు - ఆకాశ హర్మ్యములు - పాలరాతి చెక్కడములు - వెన్నెలలోని కాంతులను తిరిగి అంబరమున బెగ జిమ్ముచుండెను. రత్నసౌధములు కుభేరుని కించపరచే ధనదాసులును గలిగి యుండెను

**2. వైకుంఠ వర్ణన :**

హరికాశ్రయమైన వైకుంఠము బంగారు మెరుపు తీగలవలె తోచి మేడల కాంతులును చంద్రకాంతపు మేడలును, మరకత మణిగణములచే నిలిపిన మకరతోరణములును, నిటారుగగల కవాటములును, స్వచ్ఛమైన గోమేధికలు గల వేదికలును, పుష్పరాగములచే నిర్మించిన కపోత బొమ్మలును, వజ్రముల

సోపానములును, వైడూర్య వేదికలును, బంగారు గృహంబులును, ముత్యాల తోటలును గల వైకుంఠము మిక్కిలిగా ప్రకాశించు చుండెను. బంగారు వెండి లోహములతో నిర్మించిన గోపుర శిఖరాగ్రములు వెలసియుండెను. అచ్చర కన్నెలచే వీచబడిన చామరముల వలన ఆ గృహముందలి జనులు సేద దీర్చుకొనిరి. చల్లని వెన్నెల కాంతులకు వెండివలయుమై ఆ నగరము లొప్పారెను. మహావృక్షములపై నివసించే కీర శుక పికాదుల కలకలారావములు వినిపించు చుండెను. చిత్రవితానములు గల్గి ఘనపతాకములు గల్గి నవరసములు గలిగిన వారయ్యు కలహంసం సవ్వడి వింటున్నారు. సకల కుసుమములచేతను, నిర్మల ముత్యాలచేతను, మాటి మాటికి కేశ సంస్కారము గావించుకొనుచున్నారు. నగర మంతయు ధూపములచేత గుభాళించుచుండెను. వెన్నెలలో శృంగములు వెలుగొందెను. అడుగడుగున అమృత నదులు ప్రవహించెను. ఇట్లుండ మంటపము నందు విష్ణువు నివసించెనని అద్భుతముగా వర్ణించెను.

### 3. సింహాచల వర్ణన :

శ్రీహరి సింహాచలమున పూజింపబడిన ప్రహ్లాదుని మూలమున హిరణ్యకశిపుడు చనిపోయెను. అట్టియెడ నిచట పరమేశ్వరుడు వెలసిల్లెను. అహోబిలమున కంబమున పుట్టి దైత్యుని చంపి, కృత శౌచమున రక్తపు చేతులు కడిగి, హరింపావమున కల్మషములు నాశనము చేసి, సింహాచలమున శ్రీయుక్తుడై నివసించెను.

ఇట్టి సింహాచలమున బుట్టిన మానవకోటికి మరుజన్మలేక స్వర్గధామమును చేరుదురు. ఇచటి స్వామిని జూచినవారికి, పాపములు నశించును. ఆ కొండవైపు చూచి మ్రొక్కువానికి ముక్తి లభించును. అమర వరులచేత కిన్నరాదులచేత పూజింపబడెను. పురూరవ చక్రవర్తిచేత పూజింపబడెను. ఇచటి అరణ్యము ఫలాచలనొసగి కైవల్యము నందజేయును. ఇచ్చటి వర్ణనలు బ్రహ్మాది దేవతలకును పొగడశక్యము కాదు. ధరణిపైనగల క్షేత్రములలో సింహాచల క్షేత్రమే గొప్పదని చెప్పెను.

### 4. ఋతువర్ణన :

భూరుహములు మిక్కిలి పెరిగియుండెను. అందులో నివసించు శుక పిక శారికములు గానములు సేయుచుండెను. వసంతమున మన్మథుడు చెలి కాంద్రతో వనమున ప్రవేశించెను. శుకనాదములు వేదగానములయ్యె. తెల్లని కేసరములు అక్షింతలయ్యె. తేటి గీతములు దేవకన్యల పాటలయ్యె. పుప్పొడులు గంధములయ్యె. మల్లె మొగ్గలు తలంబ్రాలు అయ్యె. చూత మామిళ్ళ తోరణము లయ్యె. పండుటాకులు వేదికలయ్యెను. గురివిండలు పందిళ్ళు అయ్యెను.

చండాలురకు పాన కాంక్ష గలిగె. జనులకు కోరిక తీరికలెత్తె. విప్రులకు శుభఫలము గలిగెను. గంగ తీరమున గల శివునివలె కొండపై గంగ కన్పడెను. అలసిన సురరాజునకు సేద దీర్చెడి ఏరులు- పిల్లవాయువులు- సంగీత ధ్వనులు గాక హిరణ్యకశివుని తపస్సునకు ముత్యాల సేస వలె వడగళ్ళ వాన కురిసెను. అనేక జంతువులు నివసించి, శత్రు భావము విడనాడి సౌఖ్యముగా నుండెను.

### 5. యుద్ధ వర్ణన :

బ్రహ్మచేత వరములు పొందిన హిరణ్య కశిపుడు దేవలోకముపై దండెత్తగా, ఇంద్రుడు ఐరావతము నెక్కి దేవగణముగూడి యుద్ధమునకు సిద్ధమయ్యెను. ఇంద్రుడు దానవేశ్వరుల ద్రుంచెను. శమనుడు కాలదండముచేత మితిలేని యుద్ధము చేసెను.

### 6. దౌహృద వర్ణన : (గర్భధారణ వర్ణన) :

హరిభృత్యుడు అంబరము నుండి తెగిన తారవలె దితి కోడలి గర్భమున ప్రవేశించెను. ఆమెకు గర్భలక్షణములు పొడ సూపెను. రాక్షసుని కీర్తి విస్తరిల్లునట్లు కలికికి నూగారు నల్లనయ్యెను. రాక్షసుని వాసనంపవలె పడతికి హారములు భారమయ్యెను. దేవతలు సుఖింతురో యన్నట్లు చెలిచెక్కిళ్లిలు మారిపోయెను. జగములు మూకువలె వకుల సుడులు దిరిపోయెను. హరి బెదరింపులా

యున్నట్లు పొంతి నుదరము హెచ్చెను. ఆమెకు మంటి చౌరవయ్యెను. మన్మథుడు డాల్చిన బంగారు బొంగరమా యన్నట్లు, నవ నవ శోభలు తోచెను.

ఇంతికి మోము వెల వెల బారగా బంధీకృతులకు కాంతులు అమరెను. ఈ విధముగా నవమాసములు మోసిన పిదప ముద్దుల కొడుకును గనెను.

**7. చంద్రోదయ వర్ణన :**

ప్రహ్లాదుని అబ్ధిలో పడవేసినపుడు రక్షించుటకై సూర్యుడు గ్రుంకెనో యనునట్లు రవి హస్తమించెను. పద్మములు వికసించెను. హేమ కశిపుడు తనయుని జంపుమని భటుల కాజ్ఞాపించగా విష్ణు పదమున పూజవలె చుక్కలు ఆకాశమున మొలిచెను. పశ్చిమ దిశన చంద్రుడు రాక్షసుని చంపు కోపమున ఎఱ్ఱబారి పైకి వచ్చెను. తనయుని చంప తలపెట్టిన దైత్యుని జూచి నవ్వినట్లు ఆ శశిరవాశి నవ్వెను చల్లదనము హెచ్చెను.

**8. సూర్యోదయ వర్ణన :**

బ్రహ్మదేవుడు దైత్యున కిచ్చిన వరము తరువాత సూర్యుడుదయించెను. సంసార బంధము అల్లుకొనునట్లు సూర్యకిరణాలు భూమిపై పడసాగెను. తేటి పిండులు గీతములు పాడెను. చక్రవాకములు కవగూడెను. కుముదములు వాడెను. కలటాంగినల కోరెకలు పీడెను. కలువల చుట్టము కానరాదయ్యెను. తుమ్మెదలు పూలపై వ్రాలెను. గుడ్లగూబలు దాగెను. పక్షులు మేల్కాంచి సూర్యోదయవేళ కూతలిడెను. సగము విప్పిన పద్మముపై హిమబిందువులు గంధపు పుప్పొడులు రాలగా దంపతులు క్రీడతో తేలియాడునట్లు గురిపెట్టరాని కోరికలవలె తోచెను. ఇట్లుండగా సూర్యోదయ మయ్యెను

**9. పురుష వర్ణన :**

పురూరవ చక్రవర్తిని జూచిన ఊర్వశి వలచిన విధము వర్ణింపబడినది. మన్మథుడో, శివుడో, రజనీకరుడో, ఇంద్రుడో, కాక గంధర్వుడో, కిన్నరుడో, నిజము జూడ రాజువలె కన్పడుచున్నాడు ఆ రాజు నడుమెంతో సన్నగా సింహ

కటివలె నున్నది. చక్కని మొగము, నిజముగ చంద్రుడో, ఇతని చక్కదనము పొగడ బ్రహ్మతరము గూడ కాదు. ఇతని కన్నులు జూడ మన్మథుడో, దొర బిడ్డనో, కన్నుల జూచియే కన్యలు వలతురుగదా। చంద్రుని కన్న చక్కనివాడు. ఈ చక్కని సొగసుకాని జూచిన కాంతలు మదిలో పొక్కిపోరా । అని చక్రవర్తిని జూచి ఊర్వశి సమీపించి ప్రేమించెను. ఇట్టి పురుషవర్ణనము చేసిన వారు చాల తక్కువ. ఎక్కువగా స్త్రీవర్ణనలు చేయుట పరిపాటి.

## 10. స్త్రీ సౌందర్య వర్ణన :

పురూరవుడు ఊర్వశిని చూచి మోహించుట: బంగారుబొమ్మయో! చంద్ర రేఖయో! కల్పవల్లియో, నిలుకడగల క్రొమ్మెరుగో! మన్మథ బాణమో, వలపుల గుల్క మాణిక్యమో! సరస్వతి చేతి వీణయో కాక ఈ కన్నెకు భువన విచిత్రము గలుగ నేర్చునా!

నల్లని కొప్పు, చన్నుల చెన్ను, ఓరచూపు సొమ్ము, చక్కని చిలుక ముక్కు, ముద్దు మోము, మృగము చూపు దొంగిలింపనా? ఊరుద్వయము చేత రంభను పరాభవించెనా? పద్మకాంతిచే చంద్ర రేఖను దూలనాడెనా? మేదిని కాంతిచే బంగారము దూరమయ్యెనా? తిలోత్తమా? దీని దగిలి అందమును అనుభ వింతును గాక, నవ గంధములు గల్గి సన్న వస్త్రము గట్టిన మేటి గుబ్బలాడి హరులను ధిక్కరించె తరుణి గొప్ప నేర్పరి చల్లని గాలి, మరుని బాణము నవ్వాడి, మొనయు కచములును, నాసికా ధరసనములును యెన్నదగినవి.

## 11. గజ వర్ణన :

మదగజములు దండము లెత్తి మదకరిపై సువర్ణ పంకము వెదజల్లెను. మంచినీటిని తొండమున నింపి కరిపై చల్లెను. వాటినేమని వర్ణింతము? చెప్పరాని క్రీడల తేలుచుండెను.

## 12. అశ్వ వర్ణన :

నాలుగు మూడు గూడి రవి రథము లాగుచు చివరకు స్వామిని నీట ముంచెను. సూర్య కౌగిలియని తలంచిన స్త్రీయో యన్నట్లు సాంద్రములు దాటెను

# ౫. కథాశిల్పము

ఇందలి ఇతివృత్తము చిన్నదైనను క్షేత్ర మాహాత్మ్యమగుటచేత కథ సాఫీగా సాగదు. వర్ణనలు ఎక్కువ స్థలమహిమ చూపుటచేత మిక్కిలి వర్ణిత మైనది. కవి ఇందలి కథను మనోహరమూ చిత్రించెను.

## పాత్ర చిత్రణ :

ఇందలి పాత్రలు హిరణ్యకశపుని ఇంద్రుని యుద్ధము- బ్రహ్మ వరములు. ప్రహ్లాదుని భక్తి భావన - సుముఖుని పాత్ర - పురూరవుని అవయవ వర్ణన - ఊర్వశి అవయవ వర్ణన - సింహాచలమున గల జంతు జాలములు - భూరుహముల వర్ణనలు మిక్కిలి మనోహరముగా గరవు.

## కథలోని నేర్పు :

ఇది క్షేత్రమాహాత్మ్యమైనను ప్రబంధ ఫక్కిన నడిపి జైమిని మునీంద్రునిచే కథ చెప్పించుటవలన పౌరాణిక స్థానము కల్పించుకొనినది.

## నాటకీయత :

మనుచరిత్రలోని వరూధిని కథవలె శృంగార రస ప్రధానమై నాటకము రమ్యముగా సాగినట్లు తోచును. సుఖాంతముగా సాగిన కథ

## నాయక - నాయిక లక్షణములు :

ఇందలి ప్రధాన నాయకుడు శ్రీహరి. ఉపనాయకుడు హిరణ్యకశిపుడు. భక్తుడు ప్రహ్లాదుడు ఇంద్రుడు సేనానాయకుడు, బ్రహ్మ వరప్రదాత. ఇట్లు సాగిన కథ పురూరవ - ఊర్వశిలలో శృంగార ఘట్టములన్ని క్షత్రియుద్రోక్తి పురుష స్త్రీ వర్ణనల కాలవాలమైనది. ఇందలి నాయక నాయికల లక్షణాలు పౌరాణిక సంబంధమైనవి.

# శ్రీ సింహాచల క్షేత్రమాహాత్మ్యమునకు భీమేశ్వర పురాణమునకు సామ్యము

శ్రీనాథుని భీమేశ్వర పురాణము ప్రథమ క్షేత్ర మాహాత్మ్యము (తెలుగులో). శ్రీ భీమేశ్వర పురాణము రచించిన శ్రీనాథుడు 15వ శతాబ్దమునకు చెందినవాడు గదా! ఇతడు తన పురాణములో పురాతన కవీంద్రులను ప్రథమాశ్వాసము 5, 6, 7, 8, 9, 10 పద్యములలో కీర్తించెను కుకవినికూడ 12 నుండి 17 పద్యములవరకు నిరసించెను.

శ్రీ సింహాచల క్షేత్ర మాహాత్మ్యములో కూచిమంచి తిమ్మన ప్రథమాశ్వాసములో 9, 10, పద్యములలో కీర్తించినాడు. కుకవి నింద చేయలేదు. తన వంశ వర్ణన గావించినాడు. శ్రీ నాథుడు అన్నయ మంత్రి వర్ణన గావించినాడు.

భీమేశ్వర పురాణములో "కమలనాథుని మనుమడవు విమలమతివి"- శివపురాణంబు తెలుగుగా జేయుమొకటి- అని తన కంకితమిమ్మని కృతిపతి కోరినాడు.

తిమ్మన తన కావ్యమును భగవంతునికి అంకిత మిచ్చినాడు.

పోతన భాగవతంలో "ఇమ్మనుజేశ్వరాధముల... వాహనంబులు" అని చెప్పి భగవంతునకే అంకితమిచ్చినాడు గదా!

అట్లే తిమ్మనయు అంకితము గావించినాడు.

కం॥ పనిబూని తుచ్ఛభోగం
బునకై కొరగాని జనుల బొగడుటయెల్లన్
గనుగొన నిహపరదూరం
బనితలచి వినిర్మలాంతరంగుడవగుచున్.[1]

అని తలచిన తిమ్మన సింహాద్రి నాథునకే తన కావ్యాన్ని అంకితమిచ్చినాడు.

1. శ్రీ సిం. మా - 1 - 57.

భీమేశ్వర పురాణములో శ్రీనాథుడు బెండపూడి అన్నయామాత్యుని పూర్తిగా వర్ణించినాడు.

ఈ రెండు కావ్యాలకు స్కాంద పురాణమే ఆధారమని ఇద్దరు చూపినారు. మూల స్థల పురాణములోను స్కాంద పురాణము ఆధారమని చెప్పబడినది

శ్రీనాథుడు తన పురాణమునకా పేరు వచ్చిన విధమును క్రింది విధముగ చెప్పబడినది.

కం॥ భీమమగు గరళ కూటము
భూమియు గగనమును దిశల బొదచూపినచో
భీమగతి మ్రింగె గావున
భీమేశ్వరుడయ్యె నితడు బిరుదాంకమనన్[1]

అని చెప్పుట వలన క్షేత్రమునకు భీమేశ్వర స్థలనామము గల్గి పుణ్యక్షేత్రముగా వెలసినదిగా భావించదగును.

అదే విధముగా తిమ్మన

కం॥ సింహాకారంబున నర
సింహాధిష్టితమునై వసించు నగేంద్రం
బంహస్సంహారకమది
సింహాద్రి యనంగబరగు శివకరముగుచున్[2]

అని చెప్పినాడు.

భీమేశ్వర పురాణములో భీమేశ్వరుడు (శివుడు) అధినాయకుడు. సింహాచల క్షేత్ర మాహాత్మ్యములో సింహాద్రి నారసింహుడు (శ్రీహరి) నాయకుడు

---

1. భీమేశ్వర పురా-4-46.
2. శ్రీ సిం.మా - 1-78.

కావున భీమేశ్వరము శైవ ప్రాధాన్యముగలది. సింహాద్రి వైష్ణవ ప్రాధాన్యము గల్గియున్నది.

భీమేశ్వర పురాణము తొలి తెలుగు క్షేత్ర మాహాత్మ్యము. ఇందలి కథా ప్రారంభమున నైమిశారణ్యమున శౌనకుండను ముని తన శిష్య గణంబులకు చెప్పిన కథలో రోమహర్షపుత్రుడు బాదరాయణుని శిష్యుడు సూతుడు. అతని వలన స్కాంద పురాణమును వినుచుండగ వ్యాసుడు కాశిని బాసిన విధమును చెప్పుట శిష్యులు కారణములడుగుటతో ప్రారంభమైనది.

సింహాచల క్షేత్ర మాహాత్మ్యమున జైమిని మునీంద్రుడు తన శిష్యులకు పుణ్య కథలు చెప్పు సందర్భమున జగన్నాయక క్షేత్ర మాహాత్మ్యము వింటిమి. ఇంక వినదగిన క్షేత్ర మాహాత్మ్యమేదేని గలదా? అని అడుగుట వలన జైమిని నృసింహ చరిత్ర చెప్పుటతో కథ ప్రారంభమగుచున్నది. భీమేశ్వరములో బుట్టినవారికి మోక్షము లభించునని చెప్పుటలో కవి-

కం॥ అచ్చపుగు భోగ మోక్షము
లచ్చోటం దొరకు గరతలామలకముగన్
విచ్చల విడి బ్రతికి నపుం
బచ్చిన గడు లెస్స భీమ శంకరు నగరున్[1]

ఇట్లే తిమ్మన తన క్షేత్ర మాహాత్మ్యములో-

చం॥ పొలుపుగ సింహశైలమున పుట్టిన మానవ కోటి కెప్పుడున్,
గలుగదు తల్లి గర్భమున గ్రమ్మర బుట్టుటయే స్థలంబునన్
బొలసిన పుణ్యమానసులు భూరి వినిచ్చల భోగలీలలన్
వెలయుచు విష్ణు లోకమున వేడుక నుందుర నేక కాలముల్[2]

1. భీమేశ్వర పురా - 2-19.
2. శ్రీ సిం. మా. - 1-95,

భీమేశ్వర పురాణములో శ్రీనాథుడు

కం॥ దక్షుని సవనాగారము
దక్షారామంబు శివుడు దన్మధ్యము నం
సాక్షాత్కరించి యుండుట
మోక్షము భోగంబు బ్రాతెముజ్జగములకున్[1]

తిమ్మకవి కావ్యములో-

గీ॥ వెలయు భగవంతుడా నరసింహమూర్తి
సదయ హృదయుండు భోగ మోక్షప్రదుండు
భక్త వత్సలు డఖిల సంపత్కరుండు
పూని విరతంబు జగముల బ్రోచుచుండు.[2]

ఈ భీమేశ్వరాని కేది సంరాదని శ్రీనాథుడు -

తే॥ భీమనాథేశ్వరుని కన్న పెద్ద వేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమ పదంబు
సప్త గోదావరము కంటె సకల తీర్థ
సారమగు తీర్థరాజంబు జగతి లేదు.[3]

తిమ్మన సింహాచలాన్ని మించినది లేదని -

సీ॥ మఱియును సింహాద్రి మహిమ వర్ణించెద
వినువారి కెంతయు విస్మయముగ
మది బుట్టియగ్గిరి మాహాత్మ్యమంతయు
నెన్నిక గావింప నెన్న దోపు

1. భీమేశ్వర పురా - 2-16
2. శ్రీ సిం. మా. - 1-89.
3. భీమేశ్వర పురా - 2-18.

సకల ధర్మంబులు ప్రకటంబుగా నందు
దిన దినంబును బ్రవర్తించు చుండు
నవిరళముగ మహేంద్రాది శైలములనే
కమ్ములు ధరణిపై గలుగు గాని

గీ॥ యెవ్వియును సింహగిరితోడ సీడు కావు
గంగ మొదలగు నదులు చక్కగ ప్రవాహ
రూపమున నందు బ్రవహించు నేపు మీర,
మునుగు వారల నెపుడు బావనుల జేయు.[1]

భీమేశ్వర పురాణములో శ్రీనాథుడు—

కం॥ దక్షిణ వారాణాశికిని
మోక్ష శ్రీ భోగ విభవ మూలంబునకున్
దక్షారామంబునకు స
దృక్షంబగునట్టి పుణ్య క్షేత్ర (తీర్థ)ము గలదే?[2]

మరియు—

తే॥ మోక్షవిభవంబునకు సాటి మోక్షలక్ష్మి
భోగమహిమంబునకు సాటి భోగ మహిమ
వారణాశికి శ్రీ దక్షవాటమునకు
దారతమ్యంబు జర్చింప ధర్మమగునె?[3]

---

1. శ్రీ సిం. మా. 1-121.
2. భీమేశ్వర పు. 2-20.
3. భీమేశ్వర పు. 4-40.

కం॥ కోణార్క క్షేత్రము వా
రాణశి కేదార తీర్థరాజము కంచీ
కోణంబు కుక్కుటేశ
స్థాణు స్థానంబు మోక్షధామము లెందున[1]

తిమ్మన తన కావ్యములో :

ఆ.వె. క్షితినహోబిల (మును) కృత శౌచమును హరం
హావమును మృగేంద్ర పర్వతంబు
నన్నిటికిని చెక్కువగు వరకేసరి... (?)
స్థానకంబులంద్రు తత్వ విధులు[2]. అని పేర్కొనెను.

పోతన జగత్తునుగూర్చి చెప్పిన పద్యము "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల" అనునట్లే తిమ్మనయు "ఉ॥ ఎవ్వడ లీలచే జగములన్నియు మున్ను సృజించె ప్రేమతో" అను పద్యమును పేర్కొనెను.

భీమేశ్వరములో చేసిన దానములను శ్రీనాథుడు-

తె॥ అవట దానంబు హోమము మధ్యయన విధులు
శ్రాద్ధమును దేవతా సమర్చనము వ్రతము
లొక్కటొక్కటి కోటి గుణోపలబ్ధి
సంభవించును సతతంబు సాధకునకు[3]

అని వర్ణించగ—

1. భీమేశ్వర పు. 3-147.
2. శ్రీ సిం. మా. 1-73.
3. భీమేశ్వర పురా. 3-148.

తిమ్మన సిం. మా. లో-

గీ॥ రహిఁగరు క్షేత్రమున రవిగ్రహణ వేళ
చేయు ఘారంబులద్దంబు వేదవేద్యు
లైన విప్రులకిడు ఫలంబిచ్చు సింహ
గిరిని తుల మెత్తు పసిండి భూసురుల కిడిన.[1]

కం॥ కనకపు కొమ్ముల మొదవుల
నానగరయుతంబు దాన మొసగిన ఫల మ
బ్బును? సింహగిరిని భూదివి
జునకొక ధేనువు నొసంగు సుగుణాత్మనకున్[2]

అని దానగుణములను పేర్కొన్నాడు. శ్రీనాథుడు చూపిన శ్రాద్ధ పిండ ప్రదానాది విధుల ఫలము—

తె॥ దత్తమిష్టంబు హుతమదీతంబు నరుల
కచట నక్షయ ఫలము జేయంగ జాలు
శ్రాద్ధ పిండ ప్రదానాది సకల విధులు
నందు ఫలియించు వర్గయ యందువోలె[3].

భీమేశ్వరమున చెప్పిన శ్రాద్ధ పిండ ప్రదాన ఫలమును గయలో చేసిన సమాన ముగా చూపినాడు. అట్లే-

తిమ్మన కవి :

గీ॥ అవనిపై మర్త్యు డఖిల ప్రయత్నములను
నరమృగేంద్ర సమర్పితాన్నములచేత
శ్రాద్ధకార్యాధికంబతి శ్రద్ధతోడ
విధియుతంబుగ నెపుడు గావింపవలయు[4].

సింహాచలమున చేసిన శ్రాద్ధ కర్మాదుల ఫలమును చూపినాడు.

---

1. శ్రీ సిం. మా. 1-101.
2. సిం. మా - 1-108.
3. భీమేశ్వర పురా - 3-155.
4. శ్రీ సిం. మా - 5-79.

## భీమేశ్వరమున శ్రీనాథుడు చూపిన స్థానములు

తే॥ రుద్ర వాటిక భీమేశ్వరుని నివాస
మందు రామేశ్వర స్థాన మభ్యధికము
రామ తీర్థంబునందు సారంబు సాటి
ధర్మ మర్మంబు రుద్ర పాద స్థలంబు[1].

అట్లే తిమ్మన-

గీ॥ ముప్పది రెండు నృహరికి మూర్తి భేద
ములు గలవటంచు విందుము మునిజనాగ్ర
గణ్య ధరణీ తలంబున గణనికెన్ని
నరహరి స్థానములు గల వరసి చూడ[2].

మరియు నింకొకటి-

అ. వె. క్షితి నహోబల(మును) కృత శౌచమును హరిం
పావమును మృగేంద్ర పర్వతంబు
సన్నిటికి చెక్కువగు నరకేసరి (?)
నావకంబులంద్రు తత్వ నిధులు[3].

పంచారామంబుల విషయాలను శ్రీనాథుడు చూపినవి – త్రిపురాసురుల కుల దేవతయగు లింగము నైదు భాగములు చేసి శివుడు 1. కృష్ణనది యొడ్డున గల అమరావతిలోను, 2. పశ్చిమ గోదావరి జిల్లా భీమవరము దగ్గర వూరిలోను, 3. ఇదే జిల్లా పాలకొల్లులోను, 4. సామర్ల కోట దగ్గర భీమవరములోను 5. దాక్షారామములోను వెలిసినవే పంచారామములు.

---

1. భీమేశ్వర పురా - 3-159.
2. శ్రీ సిం. మా - 1-68.
3. శ్రీ సిం. మా - 1-73.

నేడు "తణుకు" యనబడు గ్రామమునకు సమీపమున తారకాసుర వధ జరిగినట్లు కొన్ని ఆధారములు కన్పడుచున్నవి. నేటి తణుకునే నాడు గోస్తనీ నదీ తీరముగా పిలిచెడివారు.

1. తణుకు - పశ్చిమ గోదావరి జిల్లాలో వశిష్టానదికి 8 మైళ్ళ దూరమున తారకాసుర పురము గలదు. ఈ ప్రాంతానికి నాలుగైదు క్రోసుల దూరమున క్రింది గ్రామములు గలవు.
2. వేల్పూరు - దేవతలు విడిచిన చోట.
3. కావలి పురము - దేవతల రక్షణ శిబిర మున్నచోట దీనిని నేడు కావలి పాడు అందురు.
4. ఇతేంద్ర పురము - దేవేంద్రుడు భూమిలో విడిసిన చోటు. దీనిని నేడు "ఇతేంద్రపట్టు" అందురు.
5. అర్జునపురము - దేవతలకు సహాయముగా వచ్చిన కార్తవీర్యార్జునుడు విడిచిన చోటు.
6. కుమారపురము - కుమారస్వామి విడిచిన చోటు. ఇదే నేడు కొమరాముము అందురు.
7. సోమ రాజేంద్ర పట్టు : ఈ సమీపముననే ఈ పేరున ఒక గ్రామ మున్నది. ఇచ్చట సోముడు - ఇంద్రుడు కలిసి విడిసిన చోటుగా గావచ్చును.
8. దేవదానవుల పుంత - ఇది నేడు జుత్తిగ అనే సీమలో గలదు. క్షీరభీమా రామములను రెండు యోజనముల దూరము.[1]

వ్యాసు డీశ్వరుని స్తుతించుటలో శ్రీనాథుడు-

సీ॥ ఎవ్వని యాజ్ఞ నీరేడులోకంబులు
వర్తించునట్టి దేవరకు గాక
గ్రహ తారకములు నిక్కముగ చెప్పని యాజ్ఞ
వర్తిల్లునట్టి దేవరకు గాక

---

1. ఆం. సా. ప. కాకినాడ, సంపుటం-41, సంచిక 1-3

మనువులు పదునాల్గురును యదాజ్ఞాయుక్తి
వర్తింతురట్టి దేవరకు గాక
భువన పాలకులు యద్భ్రూలతాజ్ఞాయుక్తి
వర్తింతురట్టి దేవరకు గాక

తే॥ ధూర్జటికి గాక భీమనాథునకు గాక
నిఖిల కారుణ్య కల్యాణ నిధికి గాక
యన్య దైవంబులకు నేలయధిక భక్తి
సంఘటింతు గరాంబుజాంగులి పుటంబు[1]

తిమ్మన తన కావ్యములో నృసింహుని గూర్చి –

సీ॥ ఎవ్వాని నామంబు హేలచేనైన
త్యంతముగా శ్రద్ధనైన నొక్క
పట్టున గీర్తింపబడి యశేషాఘ సం
హరణము గావించు నబ్బురముగ
నెవ్వని గీర్తింప నిలలోన వర్ణాశ్ర
మాధికారంబు నింతైన దేశ
కాలాది నియమంబు కలుగక యుండ నె
వ్వని పేరు కలలోన నెనసి తలప

నరగ సంసారభయ వినాశన మొనర్చు
నజ్జగన్నాథుడఖిల భూతాంతరాత్ము
డాది దేవుడు సంసిద్ధుడవ్యయుండు
తవిలి వినుతింప నెటువలె తగుడు చెపుడ[2]

1. భీమేశ్వర పురాణము - 3-206.
2. శ్రీ సిం. మా. 3-161.

భీ. పు. లో శ్రీనాథుడు చూపిన శాకములు :

సీ. త్రపున పుష్పలతామతల్లీ పటోలికా
కారవేల్లకుడుంగకముల తోడ
గూష్మాండ వృంతాక కోలకచించికా
కాయమాన కదంబకములతోడ
శాకినీ మూలకచ్ఛత్రాక సారణీ
ధాన్యాక మేఘనాదములతోడ
బిప్పల్యు పోదకీ పీతపలాండు క
వాస్తు శాఖాకోటి వాటితోడ

తె॥ రాజనలతోడ శృంగ బేరములతోడ
జిఱుగడపు బెండలము తోడ జేమతోడ,
నొప్ప నాలుగు పొలములందు పవనములు
భువన సారము పీఠికా పురవరమున[1]

(ఇవి నేడు కాకినాడ ప్రాంతపు కూరగాయలు)
తిమ్మన చూపిన వృక్ష విశేషాలు :

సీ॥ స్యందన చందన తిందుక సిందుక
వందక మందార కుందములును
లౌలతమాలహింతాల సాలరసాల
మాలతీతూ- కుందాలములును
జంబీర జంబూకదంబ నిస్సాంబు జో
దుంబర రంభారథంబుకములు
శారదారల కర్ణికార ఖంధీర (?) మా
లూర ఖర్జూర (క ?) వారములును

1. భీమేశ్వర పు-2-౬౮,

వటకుటజ నాగ పున్నాగవళ సరకుళ
చంపకాస్పద పాటలీ ఝూటలాద్య
నోక హానేకముల సుమనోహరంబు
లగు వనంబులు దనరు నన్నగమునందు[1]

అని సింహాచల అడవి యందలి వృక్ష విశేషములను తిమ్మన చూపినాడు.

వ్యాసుడు దర్శించిన సర్పపురమును శ్రీనాథుడు ఉగ్గడించుట :

కా॥ కాంచెన్ సర్పపురాభిధానముద్రిదిలింగక్షోణి వైకుంఠమున్
ముంచెన్ నారద కుండికాజలముల న్మోదంబుతో దేహమున్
జించెన్ గాశివియోగ దుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ద
ర్శించెన్ సన్మునిలోచనోత్సవముగా శ్రీ భావనారాయణున్[2]

అట్లే తిమ్మకవి ప్రహ్లాదుడు విష్ణుమూర్తిని దర్శించ ప్రహ్లాదుని తండ్రి తనయుని సముద్రముల బడ వేయించినపుడు శ్రీహరిని మొర బెట్టుకొనగా విష్ణువుని గూర్చి కవి తిమ్మన-

మ॥ కనియెన్ ముందర బూర్ణచంద్రశతసంకాశున్బత గేంద్రవా
హను విస్రస్త విభూషాంచితాంబర సముద్యన్మంద హాసాననున్
వనజాతాయత నేత్రుకంబుగళు శ్రీవత్సాంకి తోరస్థలున్
వనమాలా సహితున్ మహోన్నతు ఖగపార్థిష్ణునిన్ విష్ణునిన్[3]

ఇట్లు శ్రీ భీమేశ్వర పురాణములోని పద్యాలను శ్రీ సింహాచల క్షేత్ర మాహాత్మ్యములోని పద్యములు పోలికలు గలిగి చాల దగ్గరగాగలవు. ఈ రెండు క్షేత్రమాహాత్మ్యముల కాలము వేరైన శ్రీనాథుని ప్రభావము తిమ్మనపై బడినట్లు విదితమగు చున్నది. ఇంతేగాక, పోతన భాగవతమందలి పద్య గుణము లందు కనబడుచున్నవి. భక్తి ప్రపత్తియేకాక మోక్ష ప్రదము లందు చూపబడినవి. క్షేత్ర విశిష్టతలు కూడ కల్గియుండి కలియుగ జనామోదమునివి ఈనాటికి కూడ పొందుచున్నవి.

---

1. శ్రీ సిం.మా. 1-122.
2. భీమేశ్వర పురా - 2.65
3. శ్రీ సిం.మా. - 4.29

# చతుర్థ ప్రకరణము

## శ్రీ సింహాచల క్షేత్రమాహాత్మ్యములో ప్రతిబింబించిన మత సాంఘిక విశేషములు

### తురుష్కుల మొదటి దాడి

శ్రీ సింహాచల క్షేత్రముపై 16 వ శతాబ్ది ఉత్తరార్ధములో నరసింహ స్వామి సేవలకు క్లిష్టపరిస్థితులు గల్గియుండెను. క్రీ. శ. 1580-1612 నడుమ నున్న గోలకొండ సుల్తాను మహమ్మద్ కులీకుతుబ్‌షామీద 1580 ప్రాంతములో తిరుగుబాట్లు జరిగినవి.

మల్కా అమీన్ మల్కాను సుల్తాను పంపినాడు. అతడు కోస్తా ప్రాంతములలో అల్లకల్లోలము అలజడి సృష్టించినాడు. సింహాచలము శ్రీ కూర్మాది ఆలయాలమీద దాడి జరిగినది. ఈ ఆలయాలలోని శిల్పాలపై శైథిల్యాలిపుడు జరిగినవే కావచ్చును.

సుల్తానుకు ఈ అత్యాచారాలు తెలిసి అశ్వారాయుడు పంపగ నతడు దానాదులు చేసి ఆలయాల సేవలు పునరుద్ధరించినట్లు క్రీ. శ. 1604 నాటి ఒక శాసనమువలన తెలియుచున్నది.[1]

---

1. వరాహ పురాణము-1.
   శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య.
2. ది సింహాచలము, టెంపుల్ పేజి - 71.

# సింహాచలముపై తురుష్కుల రెండవ దాడి

క్రీ. శ. 1713 - 1787 నడుమ విజయనగర రాజ్యమేలిన విజయరామ రాజునకు శ్రీకాకుళమును సర్కారునకు చెందిన జాఫర్ అలీఖాన్‌కు విభేదాలు వచ్చినవి. ఇతడు మరాఠులతో కలిసి రాజుగారి రాజ్యము దోచుకున్నాడు. ఈ సందర్భములోనే అయివుంటుంది - ఆలయముపైకి తురుష్కులు వచ్చినారు. ఈ దండయాత్ర (దాడి) ను ఆపుదలకై ఈ మహారాజు ఆదరణ పొందిన శ్రీ గోగులపాటి కూర్మనాథకవి స్వామిని ఆలయములో ప్రార్థించసాగినాడు. ఈ సమయంలో వ్రాసినదే సింహాద్రి నారసింహ శతకము. అపుడే ఆవేదనను ఆలకించిన వాడై కందిరీగలు (గండు తుమ్మెదలు) అయి సైన్యాన్ని కుట్టి తరిమినవి. (యవనులు) తురుష్కులు, పేర్కొనబడినారు. కాని మరాఠులు లేరు.[1]

నేటికి సింహాచలము నందుగల విగ్రహములు కొన్ని విరిగినవి కలవు. దేవాలయ ప్రాంగణము గల శిలా సంపదను కూడ తురుష్కులు పాడుచేసిరి. శ్రీ కూర్మనాథకవి తాను దేవుని గుడి తలుపులు బిగించుకొని శతకము చదువు (వ్రాయు) నంతలో తురుష్కుల దండు గుడిని ముట్టడించెను. కావున అప్పటికి కొంత శిల్ప సంపదను విగ్రహాలను (దండు) సైన్యము పాడుచేసిరి. ఇవి నేటికి మనకు కన్పించుచున్నవే గదా!

కూర్మదాసుని కోరికమేరకు స్వామి ఆగ్రహము చెంది గండు తుమ్మెదల రూపము దాల్చినాడు. అట్టి తురుష్క మరాఠి దండును కుట్టింప (కరుచునట్లు చేసి) చేసినాడు. ఆ సైన్యము కొండలపై సప్పులు కుప్పలుగా పడిపోయింది. మిగిలినవారు పారిపోవుచుండగ గండు తుమ్మెదలు వెంబడించి విశాఖ పట్టణము లోని తుమ్మెదల మెట్టవరకు పోయి కరచి చంపినవి. కావున ఈ కథ యదార్థముగా జరిగినదేనని ఖాపింపబడుచున్నది.

---

1. శ్రీ వరాహ పురాణము - ఏలూరిపాటి అనంతరామయ్య పీఠిక -
2. ది సింహాచలము టెంపుల్ - 73.

# పంచమ ప్రకరణము

## విమర్శకుల దృష్టిలో ప్రస్తుత కావ్యము

ఆంధ్ర కవితరంగిణి కర్త చాగంటి శేషయ్యగారు సింహాశైల మాహాత్మ్యము తనకు లభింపలేదని చూపినారు.[1]

సమగ్ర ఆంధ్ర సాహిత్యం - 12 సంపుటములో ఆరుద్రగారు సింహాచల మాహాత్మ్యము అను ప్రబంధము గలదని మాత్రము చూపెను. దీనిని గూర్చి విపులీకరించలేదు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహములో కూచిమంచి తిమ్మకవిని గూర్చి ఇలా అన్నారు : ఇతడు 18 శతాబ్ది మొదటి అర్ధభాగమునందు జీవించినట్లును, బహు గ్రంథములు రచించి నట్లును, ఈ కవి నియోగి బ్రాహ్మణుడనియు, గోదావరి మండలము నందలి పిఠాపుర సంస్థానమందలి కందరాడ గ్రామము ఇతని నివాసమనియు తెలిపిరి. సైన్యముల రాకపోకల బెడదవలన ఇతడు చంద్రమపాలెము అను గ్రామము నకు నివాసము మార్చెను. ఇతనిని మిక్కిలి బంధుప్రీతి గలవానిగను, శివ భక్తుడును, నతని గురువు బెందులూరి లింగనారాధ్యుడు, తమ్ముడు జగ్గన పేర్కొన్నట్లును చూపిరి. ఇతడు ధనము నార్జింపలేదనియు, భక్తితో కృతులను భగవదర్పితము గావించినట్లు తిమ్మన శ్రీ సింహాచల మాహాత్మ్యములో వ్రాసిన పద్యమును ఉదాహరించారు.[2]

ఈ కవి మొదటి గ్రంథము రుక్మిణీ పరిణయ మనియు, కడపటి గ్రంథము శివలీలా విలాసము అనియు, క్రీ. శ. 1715-1756 వరకు రచనలు సాగినట్లు

---

1. ఆంధ్రకవి తరంగిణి 18 సం. 183 పేజి.
2. శ్రీ సిం. మా. 1-54.

తెలిపెను ఇతని కావ్యము లందలి విరహ వర్ణన సహజముగానే హృదయంగముగా నున్నదనియు రసికజన మనోభిరామమును గూర్చి తెలుపుచు, స్త్రీని ఎన్ని సౌందర్య వర్ణనలు చేయదలచెనో అన్ని రీతులు గలుగ చేసెననికాని, అనౌచిత్యము లేదు. నిర్లజ్జా శృంగారమునకు దిగలేదు[1]. ఇతడు పురాణా పద్ధతిన నడిపించెను. కాని నూతనత్వము లేదు. శైలి గుణములు ప్రాచీన కవులవలెనె గలదు. శ్లేష - గర్భకవిత్వము ప్రాస చిత్ర రచన గల్గి ద్రాక్షా పాకముతో కూడినదనియు రసికజన మనోరామములో స్త్రీల పట్ల (జార స్త్రీల) ప్రశంస తెచ్చియు వారు అభాగ్యభాజనులని చూపుట యుక్తముగా గలదు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో దివాకర్ల అవధానిగారు తిమ్మకవి కాలము క్రీ. శ. 1700 నుండి 1756 వరకు జీవించియున్నట్లు చూపిరి. ఇతడు పోతన వంటి భక్తిగల కవిగా పేర్కొనీ, శివభక్తి గల్గియున్నను, వైష్ణవమును కూడ కల్గి యుండెననీ వర్ణప్రియుడయ్యను ఔచిత్యము దాటలేదని పేర్కొనెను.[2]

**ఆంధ్ర శతక సాహిత్య వికాసములో గోపాల కృష్ణారావు గారు :**

కూచిమంచి తిమ్మన కవి క్రీ. శ. 1715 - 1760 మధ్యగల వాడనియు, క్రీ. శ. 1729 లో భర్గ శతకము రచించెననీ, ఇది దీర్ఘ సంస్కృత సమాస భూయిష్టమైన ప్రౌఢ రచన యనిరి. భర్గశతకములో కలియుగ ధర్మాలు గల వనియు డబ్బుకై కవులు తుచ్ఛపు రాజులను ఇంద్రులు చంద్రులనియు భీతిగల వాడిని రాముడనీయు. కురూపిని రతీశ్వరుడని స్తుతించే కవులను నిందించెను.

The Simhachalam Temple Dr. K Sundaramగారు 18వ శతాబ్దములో కూచిమంచి తిమ్మకవి, స్థల మాహాత్మ్యము - ప్రబంధములో రెండు గలవనియు, ఇతడు పిఠాపుర సమీప దారిలో ఉండేవాడనియు, ఇతడు 5 ఆశ్వాసములుగల సింహాశైల మాహాత్మ్యము అను ప్రబంధమును రచించెననిరి.

---

1. ఆం. సా. ప. 195
2. ఆం. వా. చ. 186

తిమ్మకవిని గూర్చి కూచిమంచి వెంకటరాయుడు తన సుకవి మనో రంజనములో-

"అమ్మహాత్ముని వలనగాదా ప్రసిద్ధి
గలిగె కూచిమంచి సమాఖ్యకులము కెల్ల"

అని ప్రస్తుతించినాడు.

**తెలుగు సాహిత్య సమీక్షలో జి. నాగయ్యగారు :**

క్షీణయుగ ప్రఖ్యాత కవులలో కూచిమంచి తిమ్మన (క్రీ. శ. 7100-1756) పేర్కొనదగినవాడు. ఇతడు 1715లో రుక్మిణీ పరిణయము, చివరగా శివలీలా విలాసము క్రీ.శ. 1756లో రచించెనని, పదవుల కొరకై డబ్బుకై తాను గ్రంథాలను రాజుల కంకితము చేయలేదని పేర్కొనినాడు.

# ఉపయుక్త గ్రంథసూచిక


1. అనంతరామయ్య, ఏలూరి పాటి - శ్రీవరాహపురాణము - 1986
శ్రీ సింహాచల దేవస్థానం

2. ఆరుద్ర - సమగ్ర ఆంధ్ర సాహిత్యం - సంపుటం - 12, - 1968
ఎమెస్కో - సికింద్రాబాదు.

3. ఎఱ్ఱన - నృసింహ పురాణము -

4. ఎఱ్ఱన - నృసింహ పురాణము (వచనము) బులుసు వేంకటరమణయ్య -
సింహచలం దేవస్థానం. 1983

5. కమలా అనార్కలి, - సి. డా॥ - పిఠాపుర సంస్థానము - కవి పండిత
పోషణ - 1983 పి. వి. ఆర్. ట్రస్టు - కాకినాడ.

6. కులశేఖరరావు ఎం. ఆచార్య - సింహగిరి వచనములు - 1968.

7. కూర్మనాథ కవి, గోగులపాటి-శ్రీ సింహాద్రి నారసింహ శతకము-1962
శ్రీ సింహచల దేవస్థానము -

8. గోపాల కృష్ణారావు, కె. ఆచార్య - అధిక్షేప శతకములు - 1982
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి.

9. ప్రభాకర శాస్త్రి, వేటూరి - చాటుపద్య మణిమంజరి - 1952
ద్వితీయ భాగము - ప్రథమ సంపుటము.

10. నాగయ్య, జి. ఆచార్య - ఆంధ్ర సాహిత్య సమీక్ష - 2 సంపుటం -
1985 నవ్య పరిశోధన ప్రచురణలు - తిరుపతి.

11. రామరాజు, బిరుదురాజు, ఆచార్య - తెలుగు జానపద గేయ సాహిత్యము
1978 - జానపద విజ్ఞాన ప్రచురణలు - హైదరాబాదు.

12. లక్ష్మీరంజనము, ఖండవల్లి, ఆచార్య - ఆంధ్ర సాహిత్య సంగ్రహము-
1974 - వెంకటరమణ పబ్లికేషన్స్ - హైదరాబాదు.

13. వేంకటావధాని, దివాకర్ల, ఆచార్య-ఆంధ్ర వాఙ్మయ చరిత్రము-1935,
ఆంధ్ర సారస్వత పరిషత్తు - హైదరాబాదు.

14. వేంకట రామకవి, కూచిమంచి - సుకవి మనోరంజనము - 1978
అంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - హైదరాబాదు.

15. శేషయ్య, చాగంటి - ఆంధ్రకవి తరంగిణి - 13 వ సంపుటము.

16. శ్రీకృష్ణ దేవరాయలు - ఆముక్తమాల్యద - వావిళ్ల - 1362.

17. సుందరం, కె. డా॥ - ది సింహాచలం టెంపుల్ - 1984.
శ్రీ సింహాచల దేవస్థానము

18. సుబ్బారావు, రాళ్లబండి - కళింగదేశ చరిత్ర -

19. సూరన, పింగళి - కళాపూర్ణోదయము - వావిళ్ల - 1968.

20. ఆంధ్ర విజ్ఞానకోశము - 4 వ సంపుటము - 1969.
సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశ సమితి - హైదరాబాదు.

21. శ్రీ భీమేశ్వర పురాణము - కళ్యాణి గ్రంథ మండలి - 1958 - విజయవాడ.

22. శ్రీ లక్ష్మీనారాయణ మహాక్రతు - విశేష సంచిక - మే 1984.
శ్రీ సింహాచల దేవస్థానము.

23. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక - కాకినాడ.
సంపుటం 41 - సంచిక 1-3.

24. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక - కాకినాడ.
సంపుటం - 58, సంచిక - 3.

25. స్థల పురాణము - శ్రీ సింహాచల దేవస్థానము.

26. సింహాచల శాసనములు - డా॥ ఎన్. ముకుందరావు గారు.

# అనుబంధములు

**Andhra Pradesh District Gazetters - Vishakapatnam Gazetters of India - Government Central Press - Hyderabad 1979. Page No. 239 Simhachalam Pop : 4,716, LAT 17° 47' LONG 83° 15' E.**

Simhachalam, a hamlet of Adivivaram village, is a place of piligrimage in Vishakapatnam taluk. It is situated on the Simhachalam range of hills. It is about 16 km. from Vishakapatnam connected by both rail and road. The Vishakapatnam Airport is about ten K. M. from here. The temple of Varaha Lakshmi Narasimha is situated on the hill which in 244 Meters above the sea level. The way upto the temple vews through the green covered with Pinapple fields, besides mango, jack and other fruit trees. There is a flight of broad steps Numbering over a thousand from the fort of the hill. There is also a meterable ghat road from the foot of the hill, on which Devasthanams buses ply regularly. Architectually this ancient temple deserve high praise. It containe a square bring surmated by a high tower a porticg in front with a smaller tower; a square sixteen pillared Mandapam. Facing the portico and enclosing verandah, all made of dark grainte. All these are richly and delicated carved with cavential and flored ornaments and scens from the Vaishnavika Puranas, one of the pillars locally knows

as the Kappam Stambham (Tribute pillar) is believed to possess great curative powers. There is a stone car with stone wheels and pramcing stone horses. The Image of the deaty is small and always kept covered with sandal paste. In may every year, this sandal paste is removed cermouinously at the festival called Chandana Yathra. On the north side of the temple there is an excellent Natya Mandapam where Kalyano-tsavam is performed. This Mandapam is supported by 96 pillars of black stone, exquisitely carved and arran-ged in sixteen rows of six each. The exact age of the temple is known but it counting an inscription dated as for back as A. D. 1098-99 of the Cholaking Kulot-tunga I who conquerred the Kalinga territories. An-other inscription shows that a queen of the Velanadu Chief Gonka III (A.D. 1187-56) covered the image with gold. A third says that the eastern ganga king Nara-simha I built the Shrine, the Mukhamandapam, the Natyamandapam and enclosing Verandah is black stone and the other grant incribed on its walls make it a place of historical importance. The most important festivals celebrated here are (1) The Kalyanam of Varaha Lakshmi Narasimha (March-April) (2) Cha-ndana Yathra (May) and (3) Vaishaka Poornima (May) on all these occassions Pilgrimaging numbering some thousands congregate them. A part from the religions importance attached to the place, Simhachalam is a place of enchampting scene beauty.

# అనుబంధము - 2

(INSCRIPTION No. 90, SII VOL. VI, No. 1170)

Vijayanagara

(Krishna Devaraya) Saka 1438, Dhata, Chaitra, Bha. (1) 2 = (Saturday) 29, March 1516 A. D.

The Inscription introduces the prasasti of the King as well as his exploits in the East and Capturing the forts of Uddagiri, Kondavidu and Rajamahendravara. Registers the gifts of ornaments (1) Ninty one pearl studded necklace, (2) a pair of diamond studded Kadiyas: (3) Sanka Chakra Padaka, (4) Golden Plate weighing 447 ga, Madas of ga; 2000; (5) a padaka and 500 ga, of Varhas by Chinnadevi, and (6) a padaka and 500 ga, of Varahas by Tirumala Devi to the God Narasimha.

1. శుభమస్తు శ్రీమన్ మహా రాజాధిరాజ
   రాజ పరమేశ్వ ర మూరు - రాయరగండ
   అరిరాయ విభాడ భాష గెతపరాయర
   గండ. యవన - రాజ్య -

---

The Simhachala Inscriptions - Dr. N. Mukunda Rao, - page 155.

2. స్థాపనాచార్య శ్రీ వీర ప్రతాప కృష్ణదేవ
మహారాయలు విజయ నగరాన సింహాసనా
రూఢుడై పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేశి

3. ఉదగిరి కొండవీడు కొండపలి రాజమహేంద్రవరం
మొదలయిన దుర్గాలు సాధించి సింహాద్రికిన్
విచ్చేసి స్వస్తి శ్రీ జయాభ్యుద -

4. య శాలి వాహన శక వర్షంబులు 1438 అగు
నేటి ధాతు సంవత్సర చైత్ర బ. (1) 2 వరాన
సింహాద్రి నాథున్ని దర్శించి తమ తల్లి నాగా -

5. దేవయంగారికిన్ని తమ తండ్రి నరసానాయనిం
గారికిన్ని పుణ్యము - గాను దేవునికి సమర్పించిన
కంఠమాల 1. కి ముత్యాలు (91) వ-

6. జ్రిమాణిక్యాల కడియాల జోడు (శంఖ చక్రాల
పదకం। పైడిపళెం। కి తూంకాలుగ 4402 కానిక
మాడలుగ 2000 తమ దేవుకు

7. చింనాదేవమ్మం గారి చాతను సమర్పించిన
పదకం। వరహాలుగ 500 తిరుమల దేవమ్మం గారి
చాతను సమర్పించిన పదకం। వరహాలు

8. గ 500 ఇంతవటు సమర్పించిన ధర్మ శాసనం।

# అనుబంధము - 3

Inscription No. 91. (SII. Vol. VI, No. 694)

Vijayanagara

Krishna devaraya

Saka 1438, Dhatu, Chaitra ba. 12 = Saturday, 29th March, 1516 A. D.

Introduces the Prasasti of Krishnadevaraya. It records the gift of ornaments made by Krishnadevaraya for the merit of his parents Nagadevamma and Narasanayaka to the God Simhadrinatha after advising the conqueart on the East. The Victories consist of the capture of Uddagiri, Kondavidu, Kondapally and Raja mahendravara durgas. The two queens Chinnadevi and Tirumaladevi also made the gifts of ornaments to the God. The ornaments so gifted by Krishnadevaraya are Kanthamala with studding of ninty are Mutyalu, a pair or Kadiyams, are Pataka of Sanka and Chakra, are gold Plate all weighing ga. 44782 and 2000 ga. Kavikama das, the ornaments gifted by the queens are the two patakas, each weighing 500 Varaha ga (ga studing for gadya).

---

The Simhachala Temple Inscriptions-Dr. N.M. Rao page 156 to 157.

1. శుభమస్తు। శ్రీమన్ మహారాజాధి రాజ రాజ పర
మేశ్వర మూరు - రాయర గండ అరిరాయ విభాడ
భాషగె తప్పువరాయరగండ యవన - రాజ్య
స్థాపనాచార్య శ్రీ వీర ప్రతాప కృష్ణదేవ
మహారాయలు విజయ - నగర సింహాసనా
రూఢుండై పూర్వ దిగ్విజయ యాత్రకు వచ్చే -

2. శ్రీ ఉదయగిరి కొండవీడు కొండపల్లి రాజ
మహేంద్రవరం మొదలయిన దుర్గాలు సాధించి
సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ జయాభ్యుదయ
శాలివాహన శక వర్షంబులు 1438 అగు
నేంటి ధాతు సంవత్సర చైత్ర బ. 12 వరాన
సింహాద్రి నాథున్ని దర్శించి తమ తల్లి
నాగాదేవమ్మంగారికిని తమ తండ్రి
నరసానాయనింగారి -

3. కి పుణ్యంగాను దేవునికి సమర్పించిన
కంఠమాల । కి ముత్యాలు 91 వజ్రమాణిక్యాల
కడియాల జోడు । శంఖు చక్రాలు పదకం ।
వెండి పళ్లెం । కి తరాంకాలు గ 44782.
కానిక మాడలు గ. 2000 తమ దేవుళ్లు
చిన్నాదేవమ్మంగారి చాతను సమర్పించిన
పదకం । వరహాలుగ. 500 తిరుమల దేవమ్మంగారి
చాతను సమ -

4. ర్పించిన పదకం । వరహాలు గం. 500 ఇంత పట్టు
సమర్పించిన ధర్మ శాసనం ॥

# అనుబంధము - 4

Inscription No. 92 (SII. Vol. VI. No. 696)

**Vijayanagara**

**Krishna Devaraya**

Saka 1438, Dhatu, Chaitra ba. 12 = (Saturday) 29th March, 1516. A. D.

1. శుభమస్తు ॥ శ్రీమన్ మహారాజాధి రాజ రాజ పరమేశ్వర
మూరు - రాయరగండ అరిరాయవిభాడ భాషగిత
పువరాయర గండ యవన - రాజ్య -
2. స్థాపనాచార్య శ్రీ వీర ప్రతాప కృష్ణదేవమహా
రాయలు విజయ నగరాన సింహాసనా రూఢుడై
పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేశి
3. ఉదగిరి కొండవీడు కొండపలి రాజమహేంద్రావరం
మొదలైన దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి
స్వస్తి శ్రీ జయాభ్యుద -
4. య శాలివాహన శక వర్షంబులు 1438 అగు నేటి
ధాతు సంవత్సర చైత్ర బ. 12 వరాన సింహాద్రి నాధున్ని
దర్శించి తమ తల్లి నాగా-
5. దేవయం గారికిన్ని తమ తండ్రి నరసానాయునిం
గారికిన్ని పుణ్య - ముగాను దేవునికి
సమర్పించిన కంఠమాల। కి ముత్యాలు 91. వ-
6. జ్రమాణిక్యాల కడియాల జోడు। శంఖ చక్రాల
పదకం। కి పైడి - పళెం। కి తూంకాలు
గ. 44782. కానిక మాడలు గ. 2000 తమ దేవుకు.
7. చింనాదేవం మంగారి చాతను సమర్పించిన
పదకం. వరహాలు గ. 500 తిరుమల దేవంయం గారి
చాతను సమర్పించిన పదకం। వరహాలు
8. గ. 500 ఇంత్రపట్టు సమర్పించిన
ధర్మ శాసనం.

# అనుబంధము - 5

(SII. Vol. VI No. 695)

Vijayanagara
Krishnadevaraya
Saka 1441, Pramadi, Sravana Su. 13
Somavara = Monday, 8th August, 1519 A. D.

The Inscription records the gift of the gramas along with the hamlets taken from Prataparudra Gajapati named Pedagam, Aganapudi, Gangavaram Palle, and Pinna Aganapudi, situated in the Kalingadandapata for running the daily bhogas in the name of Krishnadevaraya. The bhogas consisted of Agaru, Karpura, Kasturi, Kumkumapuvu, Flower Gardens, Biyyam and others.

1. శుభమస్తు (1) స్వస్తిశ్రీ (2) విజయాభ్యుదయ
శాలివాహన శక వర్షఁబులు 1441 అగు నేటి
ప్రమాది సంవత్సర శ్రావణ శుద్ధ 13 సోమవారాన
శ్రీమన్ మాహారాజాధి రాజ రాజ పరమేశ్వర
మూరు రాయరగండ అరిరాయ విభాడ
భాష గెత పృష్పవరాయర గండయ (ప)
నరాజ్య (స్థా) మాచార్య శ్రీ వీర ప్రతాప
కృష్ణ దేవ మహారాయలు విజయనగరం
సింహా

2. సనారూఢుడై సింహాద్రి నాధునికి తమ పేరింటి
భోగం నడచే అందుకు ప్రతాప రుద్ర గజపతి
మహారాయల చాతను పుచ్చుకొంన్న గ్రామాలు
కళింగ దండ పాటలోని గ్రామాలు పెదగాణి
గ్రామము। అగనపూడి గ్రామము।
అదుకు చెల్లె పల్లెలు గంగ్గవరం పాల్లె। పిన్న
అగ్నపూడివలె। ఉభయం గ్రామాలు 2 కి
సింహ్యాంగిరి ఆ పనికి

3. నడచే భోగ విహాణం పటుడు దినం।
కంటికి శ్రీ అంగం భోగానకు గంధం పలం
అగరు మా 2 కపూ౯రం చిన్నం కస్తూరి చి।
పంనీరు చి 4 కుంకుమ పూఒచి। పూల దండలు 4
మాలెలు 4 నైవేద్యానకు బియ్య (0) పుటి
పకాళం తూ 2 (పా)యసం తూ 6 కూరలు
4 పిండాలు నాడీలు 8 సారసేతులు 8
అరిశలు 8 (సో) దుమనోహరాలు 8 చంన్నపు-

4. నోహరాలు 4 సంపనాబణం 8 అపాలు 8
హంసకళిలు 8 కపూ౯ర కాంత్తులు 8
బడాలు 8 కక్కులాలు 4 వెర (శి) 80
పానకాలు 2 (గుడి) కాఖంచం। నైయి (0)
వేద్యానికుంన్ను పిండాలకుంన్ను కూడి నై ఇ
ఏడు తూములు పెరుగు యిదుముంను
కుంచెడు పైన 4 పోకలు 50 తమల (పా)
కులు 100 మిరియా తోలా సంబారాలు 5
కరాంభు యెత్తు

5. మాడ (11)